





శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక–17

(కాంచీమహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి

ద్రావిడవ్యాసాలకు అనువాదం)



శ్రీ శెల్వనారాయణ పెరుమాళ్, మేల్కోట



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్మగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# కాకాసురశరణాగతి

కాకాసురుడు అనే పేరే యుక్తమైనది కాదు. ఈ కాకి దేవజాతికి చెందినది తప్ప, అసుర జాతికి చెందినది కాదు. ఇంద్రుని కుమారుడు జయంతుడు అనేవాడు మాంసాన్ని తినడంలో ఉండే ఆశ చేత కాకవేషాన్ని ధరించి వచ్చాడు, అంతే. "అసురకార్యం చేసినందువల్ల కాకాసురుడు అని అంటున్నాము" —అని అంటే, ఇతడు దేవజాతికి చెందినవాడు— అనే తత్వాన్ని మరువరాదు. శ్రీవేదాంతదేశికులుకూడా రఘువీర గద్యంలో "పిశితరుచివిహితదురిత" అని పలికిన తరువాత, "వలమథన తనయ బలిభుక్" (ఇంద్రుని కుమారుడు కాకి) అని అనడాన్ని గమనించవచ్చు. శ్రీరామచంద్రుడు భరతునకు పాదుకాప్రదానం చేసి, అతనిని పంపించిన తరువాత చిత్రకూటంలో నివసించిన సమయంలో జరిగిన వృత్తాంతం, ఇది. "శిత్తిరకూటత్తిల్ ఇరుప్ప శిఱుకాక్కై ములై తీండ" అనే పాశురంలో పెరియాళ్వార్లు ఈ వృత్తాంతాన్ని ప్రసాదించారు. రఘువీర గద్యంలో కూడా అయోధ్యాకాండ కథ చివరిలోనే ఇది ప్రస్తావించబడింది. అయితే, సుందరకాండంలోనే ఈ కథ వ్యక్తమవుతున్నది. సీతాదేవి హనుమంతునకు చెప్పే గుర్తుగా ఈ కథ వ్యక్తమైనది. కంబ మహాకవి కూడా ఈ విధంగానే చెప్పాడు. ఆదిశేషాంశ సంభూతుడైన లక్ష్మణుననకు కూడా తెలియని కథ ఇది— అని సీతాదేవి హనుమంతునితో చెప్పినట్లు ఉన్నది. ఎల్లప్పుడూ శ్రీరాముని వెంటనే ఉండే లక్ష్మణునికే తెలియనప్పుడు, వాల్మీకికి తెలిసే దారేది? అందుచేతనే ఈ కథను జరిగిన సందర్భంలో ముని చెప్పలేదు కాబోలు. ఆ విషయం అటు ఉండనివ్వండి. ఈ కాకి కథను తెలియనివారు లేరు. సుందరకాండలో 38 వ సర్గలో సీతాదేవి హనుమంతునకు చెప్పే ఈ కథ పరిపూర్ణంగా ఉన్నది. ఈ కథను గూర్చిన వివరం ఇక్కడ వద్దు. కాకి చేసిన శరణాగతిని గూర్చి చెప్పమని అన్నందున, దానిని విమర్శన వైఖరిలో విజ్ఞాపిస్తాను.

మన పూర్వాచార్యగోష్ఠిలో కాకాసురుని గూర్చి, రావణునిగూర్చి ఒక చర్చ జరిగింది. వేదవతి ఇచ్చిన శాపం చేత సీతాదేవిని రావణుడు తాకలేదు. కానీ, కాకి ఆమె తిరుమేనును తాకి తీవ్రమైన అపరాధం చేసింది. అయితే, కాకి ప్రాణాలను దక్కించుకున్నది. రావణుడు మాత్రం నశించిపోయాడు. దీనికి ఏమి కారణం?అనే విషయాన్నిగూర్చి చర్చ జరిగింది.

అందులో ఒక మహానుభావులు ఈ విధంగా అన్నారు. "కాకికి సీతాదేవిపురుషకార బలం ఉన్నది. అందుకే, బతికి బయటపడడం జరిగింది. రావణునకు అది లేనందు వల్ల అతని ప్రాణాలు పోయాయి"అని అన్నారు.

ఇంకొకరు ఈ విధంగా అన్నారు. "విషయం అది కాదు. కాకి శరణాగతి చేసినందు వల్ల ప్రాణాలను దక్కించుకున్నది. రావణుడు అది చేయలేదు. "న నమేయం తు కస్యచిత్" (నేను ఎవరికి తలవంచను) అని ప్రవర్తించినందున ప్రాణాలను పోగొట్టుకున్నాడు "అని అన్నారు.

ఈ విధంగా ఈ విషయంలో రెండు వాదాలు ఏర్పడినప్పుడు, ఇంకొక మహనీయులు ఈ వాదనలో మధ్యస్థులుగా ఉండాలని కోరబడినవారై, కొన్ని విచారణలను చేయడం ఆరంభించారు.

సీతాదేవి తన పురుషకార కృత్యాన్ని శరణాగత విషయంలో చూపుతుంది తప్ప, దారిలో పోయేవారి విషయంలో చూపదు. కాకి శరణాగతి చేయడం అనేది ప్రసిద్ధంగా ఉన్నది. అయితే, రావణుడు శరణాగతి చేయలేదు— అని తెలియజేస్తే, కాకానికి శరణాగతి వల్లనే ప్రాణం దక్కింది— అని చెప్పడంలో అడ్డు ఉండదు. శరణాగతి అనేదానివి కలలో కూడా తెలియని రావణునకు సీతాదేవి పురుషకారం చేసే ప్రసక్తియే లేదు. కనుక, ఈ చర్చలో సీతాదేవిని ప్రస్తావనలోకి తీసుకుని రావడం న్యాయం కాదు. అందుకే, శరణాగతిలో కాకికి వలె రావణునకు కూడా అన్వయం

ఉన్నది— అనేదానిని నిరూపించి, కాకి శరణాగతి చేసినప్పుడు సీతాదేవి సమక్షంలోనే ఉన్నది, రావణుడు శరణాగతి చేసినప్పుడు ఆమె సమక్షంలో లేదు— అని చెప్పాలి" అని మధ్యస్తులు అన్నారు.

అప్పుడు, మొదట వాదించిన మహనీయులు ఈ విధంగా సిద్ధాంత సారాన్ని ప్రస్తావిస్తూ అన్నారు.

ప్రపత్తిలక్షణాన్ని చాలా నిశితంగా పరిశీలించి నిష్కరించి పలికిన మన పూర్వాచార్యులు "భగవత్ప్రవృత్తివిరోధి స్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః" అని అన్నారు. గజేంద్రుని విషయంలో, ఇద్దరూ 10 విషయంలోనూ ఈ లక్షణానికి సమన్వయాన్ని చూడవచ్చు.

గజేంద్రుడు చేసిన శరణాగతి ఎటువంటిది? "గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే "అనే విధంగా ఉండే స్థితి తొలగిపోయిన సన్నివేశం ఉన్నది కదా. అదే గజేంద్రుని ప్రపత్తి. మొసలిని తీరానికి లాగడం— అనే గజేంద్రుని ప్రయత్నం ఉన్నంతవరకు, భగవంతునకు ఆ గజేంద్రుని రక్షించాలనే ప్రయత్నం కలుగనందున, గజేంద్రుని స్వప్రవృత్తి అనేది, అంటే, తనను తాను రక్షించుకోవాలి— అని చేసే ప్రయత్నం, భగవంతుడు అతనిని రక్షించాలని చేసే ప్రయత్నం చేయనీయకుండా దానికి విరోధి అయినది. ఆ ప్రవృత్తి తొలగిపోయిన క్షణంలోనే భగవంతుడు కృపతో అనుగ్రహించడానికి అతి త్వరలో గజేంద్రుని దగ్గరకు వచ్చాడు. కనుక, "యదనంతరం యద్భవతి తత్ తస్య కారణమ్" (దేని తరవాత ఏది పుడుతుందో, ముందు ఉన్నది కారణం అవుతుంది, తరువాత పుట్టినది కార్యం అవుతుంది) అనే న్యాయంలో, ఆ స్వప్రవృత్తినివృత్తి భగవత్కృపకు హేతువు— అని అనడంలో అడ్డు లేదు. "స తు నాగవరః శ్రీమాన్ మనసా ౽ చింతయద్ధరిమ్" (గజేంద్రుడు మనసుతో భగవంతుని ధ్యానించాడు) అనే విధంగా అతనికి హరిచింతన అనేది ఎప్పుడు ఉన్నదే. "నన్ను నేను

రక్షించుకోవాలి” అని చేసే నా ప్రయత్నం పనికిరాకుండా పోయింది —అని అతడు భావించాడు” అనేదే ఇక్కడ స్పష్టమైన అర్థం.

ద్రౌపది చేసిన ప్రపత్తిని చూసినప్పటికీ, సభలో ఆమె లజ్జతో తన చీరను లాగుకుంటూ, తనను తాను రక్షించుకోవాలి— అనే స్వప్రవృత్తిలో ఉనికను కలిగి ఉన్నంతవరకు, ఆమె విషయంలో శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహం ప్రసాదించలేదు. ఆమె ఆ ప్రయత్నం భగవంతుని ప్రవృత్తికి అడ్డుగానే నిలిచింది. “ఇరు కైయుమ్ విట్టేనో !ద్రౌపదియై పోలే” (ద్రౌపది వలె రెండు చేతులను ముడుచుకొని, నన్ను నేను రక్షించుకోవాలి అనే నా ప్రయత్నం నుండి విరమించానా?) అనే విధంగా ఆమె తన ప్రయత్నం నుండి విరమించిన క్షణంలోనే భగవంతుని ప్రవృత్తి ఉదయించడం ప్రారంభించింది. ఇక్కడ కూడా “రక్ష మాం శరణాగతామ్” అని ఆమె పలికిన వాక్యం ఉన్నప్పటికీ, స్వప్రవృత్తిని చేస్తూనే ఆమె “రక్ష మాం శరణాగతామ్” అనే ఈ విధమైన మాటను చెప్పినట్లయితే, భగవంతుని ప్రవృత్తి కలగడానికి అవకాశం ఉండదు కదా.

కూరేశులు అనుగ్రహించిన వైకుంఠస్తవం అనేది, వారు అనుగ్రహించిన మిగిలిన స్తోత్రాలవలె కాకుండా, “వ్యక్తీకుర్వన్ నిగమశిరసా మర్థ మంతర్నిగూఢమ్, శ్రీ వైకుంఠస్తవ మకృత యః “అని భట్టర్ అనుగ్రహించిన విధంగా వేదాంతరహస్యార్థాలను విచారించడం కోసం ఉదయించింది. అందులో “ఏవం సదా సకలజంతుషు సాపరాధం క్షామ్యస్యహో! తదభిసందివిరామమాత్రాత్” (ఈ విధంగా నీవు, జీవులందరిలోనూ, ఎవడు తనను తాను రక్షించుకోవాలి అనే ప్రయత్నం నుండి విరమిస్తాడో, అంతమాత్రమైన అతని విరామాన్ని చూసి నీవు అతనిని రక్షిస్తావు. నీ కరుణ క్షమాగుణం ఎంత గొప్పది!) ఇ అని అనుగ్రహించారు. భగవంతుని అనుగ్రహం అనేది ఎటువంటిది? అది ఎప్పుడు ఉదయిస్తుంది? అని అంటే, మన దురభిసంధి తొలగిన క్షణంలోనే అది కలుగుతుంది. అందుచేత “భగవత్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తినివృత్తియే

ప్రపత్తి” అనేది నిరవద్యమైన సిద్ధాంతం— అని స్పష్టపడుతున్నది. అందుచేత, ఆనుకూల్యసంకల్పం మొదలైన ఐదు అంగాలతో కూడిన ప్రపత్తి అనేది లేదు —అని అర్థం కాదు. భగవంతుడు ముఖ్యంగా ఎదురుచూచే ప్రపత్తి ఇదే, అంటే, స్వప్రవృత్తి నివృత్తి అనేదే— అనేది మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఇటువంటి ప్రపత్తియే కాకి దగ్గర ఉన్నది. ఇటువంటి ప్రపత్తి రావణుని దగ్గర కూడా ఉన్నది అని అనడంలో ఏ అడ్డు లేదు. ఆ విషయాన్ని ఇప్పుడు ఉపపాదిస్తాను.

ఏ విధంగా? అంటే, “పోక్కత్తు చ్చెయలాందు నిన్ఱ నిలై కాకత్తుక్కుమ్, రావణనుక్కుమ్ ఒక్కుమ్” (ఇక ఏమీ చేయలేక నిలచిన స్థితి అనేది కాకానికి, రావణునకు, ఇద్దరికీ సమానం) పూర్వాచార్యుల దివ్యసూక్తి మూలంగా విజ్ఞాపన చేస్తాను. శ్రీరామాయణంలో “యో వజ్రాపాతాచలసన్నికాశాత్” అనే శ్లోకాన్ని తెలియనివారు ఎవరూ లేరు. అందులో ఉండే “చచాల చాపం చ ముమోచ వీరః “అనే నాలుగవ పాదాన్ని గమనించాలి. ఈ సూక్తియే రావణునకు భగవత్ప్రవృత్తి విరోధి అయిన స్వప్రవృత్తికి నివృత్తి కలిగిన స్థితిని తెలుపుతుంది. అతనిపై శ్రీరామునకు కరుణ కలిగిన సన్నివేశం అదే. లేకపోతే, “గచ్ఛ, అనుజానామి” అనే మాట శ్రీరాముని నోటినుండి అవతరించే అవకాశం ఎక్కడ ఉన్నది కనుక!. ఏమీ చేయలేక, గతి లేక నిలచిన స్థితి రావణుని విషయంలో కలగడాన్ని శ్రీరామచంద్రమూర్తి గమనించాడు. ఈ స్థితియే కాకానికి కూడా ఏర్పడింది. తెరచి ఉన్న వాకిళ్ళలో అన్నిటిలోనూ ప్రవేశించి తిరిగే జంతువు (కుక్క) వలె అన్ని దిక్కులలో పరిగెత్తి పోయిన కాకి తనకు ఎక్కడా ఆశ్రయం కనిపించనందున, ఏమీ చేయలేక, గతిలేక కింద పడ్డాడు, అంతే తప్ప, బుద్ధిపూర్వకంగా అతడ శ్రీరాముని శరణాగతి చేసినట్లుగా మన ఆచార్యులు ఎవరు అభిప్రాయ పడలేదు, అనుగ్రహించలేరు. కాకాన్నిగూర్చి మొట్టమొదటగా అనుగ్రహించినవారు భగవద్యామునులు. వారు స్తోత్రరత్నంలో(63) “తాదృశో వాయసస్య ప్రణత ఇతి దయాళుః” అని అనుగ్రహించారు. ఇక్కడ “ప్రణతస్య వాయసస్య దయాళుః” అని

అనకుండా, “ప్రణత ఇతి దయాళుః” అనే అద్భుతమైన ప్రయోగాన్ని చేశారు. ఈ సూక్తిని వివరిస్తూ స్తోత్రభాష్యంలో వేదాంతదేశికులు ఏమన్నారంటే, “త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య గత్వా భూమౌ నిపతితం దయార్ద్రబుద్ధ్యా ప్రణతత్వేన పరిగృహ్య ఇతి అర్థః” (ముల్లోకాలలోనూ తిరిగి, ఎక్కడ గతిలేక వచ్చి, భూమి మీద పడిన కాకిని చూసి, దయతో ఆర్ద్రమైన మనసుతో అతడు శరణాగతి చేసినట్లుగా భావించి— అని అర్థం) అని వివరించారు. (ఈ వాక్యంలో “గత్వా” అనేది ఆనన్వితమని, “అగత్యా” అనే ఉండవలసినది తప్పుగా ముద్రింపబడిందని కొందరు పెద్దలు భావిస్తున్నారు. దానిని గూర్చిన విచారం ప్రస్తుతం ఇక్కడ వద్దు) శ్రీరాముడు తన మనస్సులో కాకి శరణాగతి చేసినట్లుగా భావించాడు —అని ఇక్కడ అనుగ్రహించడంలో ఏ విధమైన వివాదం లేదు కదా.

సీతాదేవి హనుమంతుని దగ్గర ఈ వృత్తాంతాన్ని చెప్పేటప్పుడు “తమేవ శరణం గతః” అని, “స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్” అని పలకడాన్ని గమనించినప్పుడు ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది. ఈ సందేహానికి గోవిందరాజీయ వ్యాఖ్యానం చాలా స్పష్టమైన సమాధానాన్ని ఇస్తున్నది. “శరణం గతః— నివాసం గతః, న తూపాయతయా గతః” (ఇక్కడ శరణాగతుడు అంటే, శ్రీరాముడు ఉండే చోటుకు వచ్చాడు— అని అర్థం తప్ప, ప్రపత్తి చేశాడు— అని అర్థం కాదు) అనేది అక్కడ ఆ వ్యాఖ్యానం. “ఉపాయే గృహరక్షిత్రోః శబ్దః శరణమిత్యయం వర్తతే” (శరణమని పదం ఉపాయం, గృహం, రక్షించేవాడు— అనే అర్థాలలో ఉన్నది) అనేది భగవచ్ఛాస్త్ర వచనం. శరణం అనేదానికి “నివాస స్థానం” అనే అర్థం లోకప్రసిద్ధంగా ఉన్నది.

కాకవృత్తాంతాన్ని గూర్చి పలికే పెరియాళ్వార్లు “శిఱుకాక్కై — అనైత్తులకమ్ తిరిందు ఓడ విత్తకనే! ఇరామా !వో ! నిన్నబయమ్ ఎన్ఱ ౠఒప్ప” (ఆ కాకి, లోకాలలో అన్నిటిలోను తిరిగి పరిగెత్తి వచ్చి, లో”కకారణభూతుడవైన ఓ శ్రీరామా! నీవు అభయం

ఇవ్వాలి— అని ప్రార్థించగా) అని అనడం అంతా అసంగతమేనా? అని అడుగకూడదు. తిరుమంగై ఆళ్వార్లు శిఱియ తిరుమడల్ అనే ప్రబంధంలో గజేంద్ర వృత్తాంతాన్ని ప్రస్తావించేటప్పుడు "నారాయణా! మణివణ్ణా! నాకణైయాయ్! వారాయ్, ఎన్నారిడరై నీక్కాయ్" అనే గజేంద్రుడు నారాయణుని పిలిచినట్లుగా ఉన్నది. ఇతిహాస పురాణాలలో ఈ విధంగా ఉన్నదా? ఈ కాక వృత్తాంతాన్ని సీతాదేవికి హనుమంతుడు చెప్పినట్లుగా పెరియాళ్వార్లు పలుకుతున్నారే! ఆ విధంగా కూడా ఉన్నదా? అని ఈ విధంగా ఇక్కడ పలు ప్రశ్నలు వస్తాయి. వీటిని గూర్చి పూర్వాచార్యులు ఇంతకుముందే విమర్శించారు. కనుక, ఇక్కడ దానికి సంబంధించిన వివరం ఆవశ్యకం కాదని విడువబడుతున్నది.

ఏమీ చేయలేక, గతిలేక నిలచిన స్థితియే కాకి విషయంలో సంభవించింది. ఇటువంటి స్థితియే "చచాల చాపం చ విమోచ వీరః "(చలించిపోయాడు, వీరుడైన ఆ రావణుడు తన చేతిలో ఉండే విల్లును కూడా విడచి పెట్టాడు) అని నిలచిన రావణుని విషయంలో కూడా ఏర్పడింది—అని దృఢంగా భావించవచ్చు. ఈ విధంగా ఉండగా, కాకి ప్రాణాలను దక్కించుకొని పోవడం, రావణుడు ప్రాణాలను పోగొట్టుకోవడం అనేది ఎందువల్ల జరిగింది? అనే విమర్శ ఇక్కడ ప్రస్తుతమవుతున్నది.

కాకి, ఏమీ చేయలేక గతి లేనిదై పడిన సందర్భంలో అక్కడ సీతాదేవి ఉన్నందువల్ల, "దేవ్యా కారుణ్య రూపయా "అని చెప్పబడిన ఆమె అతని శరణాగతునిగా చేసి, పురుషకారం చేసి రక్షించింది —అని పాద్మోత్తర పురాణంలో స్పష్టంగా చెప్పబడింది. శ్రీరామాయణంలో కూడా "వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" (వధింపదగినవాడు అయినప్పటికీ కాకాన్ని కృప కారణంగా రాముడు రక్షించాడు) అనే సీతాదేవి వచనంలో ఈ అర్థం అంతర్గతంగా లభిస్తున్నది. "ఘోరమైన అపరాధాన్ని చేసిన కాకాన్ని రక్షించేటట్లుగా నేను చేశాను "అని అనడం తనను తాను పొగడుకున్నట్లు అవుతుంది— అని భావించిన సీతాదేవి "కృపయా పర్యపాలయత్" అని

మరుగుపరిచి చెప్పింది, అంతే. “కృపయా— కారుణ్యరూపయా మయా” అని ఇక్కడ అర్థం. లేకపోతే, ఇక్కడ “కృపయా” అనేది పాదపూరణమాత్రంగా ప్రయోగించినట్లు అవుతుంది. “కాకత్స్థః పర్యపాలయత్” అని అనడంతోనే ఇక్కడ సరిపోతుంది కదా. శ్రీరాముడు ఉత్తమ కులంలో పుట్టిన తన గొప్పతనం చేతనే రక్షించాడు— అని అనడమే ఇక్కడ సరిపోతుంది. కృప లేకుండా రక్షించడం అనేది సాధ్యం కాదు కనుక, “కృపయా” అని చెప్పవలసిన ఆవశ్యకతయే లేదు.

ఇక, ఇప్పుడు రావణుని విషయంలో గమనిద్దాం. ఏమీ చేయలేక చేష్టలుడిగి పడి ఉండడంలో కాకంతో సమానుడైనవాడు ఈ రావణుడు— అనే విషయాన్ని ఇక్కడ మరచిపోకూడదు. “చాలా చాపంచ విమోచ” అనే విధంగా ఉండే స్థితిలో అక్కడ సీతాదేవి కనుక ఉండి ఉన్నట్లయితే, అతడు మళ్లీ తిరిగి యుద్ధానికి వచ్చేటట్లుగా విడవకుండా కలలో కిరీటాన్ని పెట్టి పంపించి ఉండేది.

ఈ సందర్భంలో ఇంకొక మర్మాన్ని కూడా వినండి. యుద్ధకాండం 14వ సర్గలో రావణునకు హితోపదేశం చేసే ప్రకరణంలో విభీషణుడు” ప్రదీయతాం దాశరథాయ మైథిలీ” అని మూడుసార్లు పలుకుతున్నాడు, విభీషణుడు. “సీతాదేవిని శ్రీ రామచంద్రునకు సమర్పించు” అనేది దీని అర్థం. రాఘవునితో మనం యుద్ధం చేసినప్పటికీ కూడా, సీతను శ్రీరామునితో చేర్చి యుద్ధం చేసినట్లయితే, మనకు ఏ విధమైన ఆపద కలుగదు సుమా! అని విభీషణుడు తెలియజేశాడు— అనేది ఇక్కడ గమనించవలసిన రహస్యం. వస్తు స్థితిలో రావణుడు ఏ విధమైన చేష్టను చేయలేనివాడై పడి ఉండే స్థితిలో అతని సమీపంలో సీతాదేవి ఉన్నట్లయితే, యది వా రావణః స్వయమ్” (ఒకవేళ, విభీషణుడు కాకుండా, రావణుడే స్వయంగా వచ్చినా, అతనిని నేను స్వీకరిస్తాను) అని ఆశపడిన శ్రీరాముని ఆశను ఫలించి ఉండేది. “తేన మైత్రీ భవతు తే “(ఆ శ్రీరామునితో నీకు సంబంధం ఏర్పడాలి) అనే ఆమె ఆశ కూడా నెరవేరి ఉండేది.

కాని, ఆ విధంగా కాకుండా, సీతాదేవి సమీపంలో లేనందువల్ల ఆ దివ్యదంపతుల ఆశ ఫలించలేదు, విఫలమైపోయింది.

ఈ విధంగా కాకి శరణాగతి స్వరూపం అతడు రక్షణ పొందిన ప్రకారం ప్రమాణగతిని అనుసరించి నిరూపింపబడింది.

★★★★

## ఆత్మస్తుతి తగినదా? కాదా?

ప్రతిఒక్కరికి నైచ్యానుసంధానం అనేది స్వరూపానికి అనురూపమైనది అని శాస్త్రాలలో చెప్పబడుతున్నది. వాస్తవంగా తమ దగ్గర ఎంతో అతిశయం ఉన్నప్పటికీ కూడా, దానిని ఉన్నట్లుగా ఏ మాత్రం భావించకుండా, అనేక విధాలైన కొరతలు తమలో ఉన్నట్లుగా భావిస్తూ, ఆ విధంగా అనుసంధించడమే నైచ్యానుసంధానం అని చెప్పబడుతున్నది. ఇదే స్వరూపానికి చాలా యుక్త మైనది అని కూడా చెప్పబడుతున్నది. దీనికి విరుద్ధంగా, ఆత్మప్రశంసను చేసుకోవడం తగినది కాదు అని కూడా శాస్త్రాలలో చెప్పబడుతున్నది. ఆత్మప్రశంస అంటే ఆత్మస్తుతి. ఇది ఎంత మాత్రం తగనిది అని చెప్పబడుతున్నది. స్వరూప జ్ఞానం చక్కగా ప్రకాశించే మహానుభావులు ఏనాడూ ఆత్మప్రశంసను చేసుకోరు. ఇ"తరులకు తోచని చాలా సూక్ష్మమైన అర్థాలను వ్యక్తం చేస్తూ పలు గొప్ప గ్రంథాలను రచించినప్పటికీ, చాలా గొప్ప విద్వాంసులుగా ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ, తన గొప్పతనాన్నితానే పొగుడుకోవడం అనేది తగిన కార్యం కాదు" అని నన్నూల్ అనే ద్రావిడ గ్రంథం తెలుపుతున్నది. ఈ విధంగా తనను తాను పొగడుకోవడం అనేది తగనిది అని అనడం విద్వాంసులకు మాత్రమే కాదు, గొప్ప శూరులుగా ఉన్నా, గొప్ప ధనికులుగా ఉన్నా, ఇంకా, కులం, రూపం మొదలైనవాటిలో చాలా ఉన్నతులుగా ఉన్నప్పటికీ, తమను తాను పొగడుపోవడం అనేది ఎవరికైనా తగిన కార్యం కాదని శాస్త్రవచనం.

ఇప్పుడు, ఈ విషయాన్ని గురించి శ్రీరామాయణంలో కొంచెం గమనిద్దాం. హనుమంతుడు ఎంతటి గొప్ప బలశాలి?, ఎంత సమర్థుడు? అనే విషయం అందరికీ తెలిసినదే. అతనికి కల సామర్థ్యంలో ఎవరికీ సందేహం లేదు. లంకలో సీతాదేవితో హనుమంతుడు మాట్లాడేటప్పుడు "మత్తః ప్రత్యవరః కశ్చిత్ నాస్తి సుగ్రీవ సన్నిధౌ" అని అన్నాడు. సుగ్రీవ మహారాజు దగ్గర నాకంటే తక్కువవాడు ఇంకొకడు ఎవడు లేడు— అని ఈ వాక్యంలో అని అర్థం. దీనికి ముందు "మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః"

అని అన్నాడు. "నాకంటే గొప్పవారు, నాతో సమానులైనన నీచులు అయిన వానరులు సుగ్రీవ సన్నిధిలో ఉన్నారు" — అని దీని అర్థం.

ఈ విధంగా తన తక్కువదనాన్ని గూర్చి తానే పలికిన హనుమంతుడే, సముద్రాన్ని దాటవలసిన సందర్భం వచ్చినపుడు, కిష్కింధాకాండ చివరిలో "పన్నగాశన మాకాశే పతంతం పక్షిసేవితే, వైనతేయ మహం శక్తః పరిగంతుం సహస్రశః" — ఆకాశంలో చాలా వేగంగా ఎగురుతూ వచ్చే పక్షిరాజును కూడా అవలీలగా నేను పట్టుకోగలను— అని తన గొప్పతనాన్ని తానే చెప్పుకోవడం ఈ వచనంలో స్పష్టంగా గోచరిస్తుంది. ఒకరే, ఒక సమయంలో తన తక్కువదనాన్ని చెప్పుకోవడం, ఆ వ్యక్తే ఇంకొక సమయంలో తన గొప్పతనాన్ని చెప్పుకోవడం జరిగితే, ఇందులో అర్థం ఏమీ కనపడదు కదా. స్వరూపానికి అనురూపమైన అనుసంధానం అనేది ఎప్పుడూ ఏ మార్పు లేకుండా కదా ఉండాలి —అని కొందరు సందేహించవచ్చు. దీనిని గూర్చి స్పష్టం చేయడానికి ముందు, ఈ విధంగా ఒకసారి నైచ్యానుసంధానం చేసుకోవడం, ఇంకొకసారి తన ఉత్కర్షను తానే చెప్పుకోవడం—< అనే ఈ క్రమాన్ని మరికొందరు మహనీయుల విషయంలో ప్రస్తావించి పలికి, తరువాత అన్నిటికీ కలిపి సమాధానాన్ని తెలియజేస్తాను.

ఆళ్వారులు నైచ్యానుసంధానం మూర్తీభవించినవారు అనే విషయం అందరూ తెలిసిన విషయమే. దీనిని సోదాహరణంగా ప్రస్తావించి చూపించవలసిన ఆవశ్యకత లేదని భావిస్తాను. ఇటువంటి దివ్యసూరుల పరంపరలో ఒకరుగా ప్రకాశించే భక్తిసారమునీంద్రులు నాన్ముగన్ తిరువందాది అనే ప్రబంధంలో "పాలిల్ కిడందదువుమ్, పందరంగమ్ మేయదువుమ్, ఆలిల్ తుయిన్టదువుమ్ ఆరఱివార్? ఞాలత్తొరుపొరుళై వానవర్ దమ్ మెయ్ ప్పొరుళై అప్పిల్ అరుపొరుళై యానఱిందవాఱు" అనే ఒక సూక్తిని అనుగ్రహించారు. "భగవంతుని నేను తెలిసి కొన్నట్లుగా ఇంకొకరు ఎవరు తెలుసుకున్నారు?" అనే అహంకారం తోచేటట్లుగా ఈ

సూక్తిలో వారు అనడం స్పష్టంగా మనకు గోచరిస్తుంది. “ఎన్ మదిక్కు విణ్ణెల్లామ్ ఉండో విలై?” అని అంటూ ఈ దివ్యసూరులే అన్నారు. ఇక, “నీశనేన్ నిఱై వొన్ఱుమిలేన్” (నీచుడను, ఏ యోగ్యత లేనివాడను), “శీలమిల్లా చ్చిఱియన్” (శీలం లేని నీచుడను) అని ఈ విధంగా తమ నైచ్యాన్ని పరమావధిలో నిలచి పలికారు, నమ్మాళ్వారులు. “ఎనక్కార్ పిఱర్ నాయకరే?” (నాకు ఇతరులు నాయకులు ఎవరున్నారు?) “ఎనక్కు ఇనియార్ నికర్ నీళ్ వానత్తే” (విశాలమైన పరమపదంలో కూడా నాకు సమానులు ఎవరున్నారు), “నావుడయేఱ్కు మాఱుళతో ఇమ్మణ్ మిశైయే” (నోరు కలిగిన నాకు సాటి వచ్చేవారు ఈ భూమిపై ఉన్నారా?) అని అంటూ వీరే తమ గొప్పతనాన్నిగూర్చి చెప్పారు. ఇంతకు ముందు అంతటి నైచ్యానుసంధానాన్ని చేసిన ఆ ఆళ్వారులేనా, ఈ మాటలు పలుకుతున్నది! అని మనకు తోస్తుంది.

ఇక, పూర్వాచార్యపరంపరలో, శ్రీయామునుల శ్రీసూక్తిక్రమాన్ని చూద్దాం. “న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశో యత్ న మయా వ్యధాయి” (నేను వేలాది సార్లు చేయని నీచమైన కర్మ అనేది ఈ లోకంలో లేనే లేదు), “అమర్యాదః క్షుద్రః చలమతిః అసూయాప్రసవభూః కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః, నృశంసః పాపిష్ఠః” అని ఈ విధంగా వీరి నైచ్యనుసంధానాలు అప్రమేయాలు. వీరే మళ్లీ, “ఆశైలాదద్రికన్యా చరణకిసలయన్యాసధన్యోపకంఠాత్ ఆరక్షో నీతసీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః, ఆచప్రాచ్యప్రతీచ్య క్షితిధరయుగళాత్ సూర్యచంద్రావతంసాత్ మీమాంసాశాస్త్రయుగ్మక్రమవిమలమనాః మృగ్యతాం మాదృశోऽ న్యః” (గౌరీదేవి పాదాల స్పర్శతో ధన్యమైన హిమాలయపర్వతం దగ్గరనుండి, రావణుడు అపహరించిన సీతాదేవి ముఖానికి ఆనందం కలగడంకోసం శ్రీరాముడు నిర్మించిన వారధివరకు, సూర్యచంద్రులను అలంకారంగా కలిగిన తూర్పుపర్వతం పడమరపర్వతం మధ్యలో, రెండు మీమాంసాశాస్త్రాలలో నావలె స్పష్టమైన జ్ఞానం కలిగినవాడు ఇంకొకరెవరైనా ఉన్నారేమో వెదకి చూడండి), “న వయం కవయ స్తు కేవలం న వయం

కేవలతంత్రపారగాః, ఆపి తు ప్రతివాదివారణ ప్రకటాటోపవిపాటనక్షమా" (మేము కేవలం కవులం మాత్రమే కాదు, మేము కేవలం శాస్త్రజ్ఞులం మాత్రమే కాదు, ప్రతివాదులు అనే ఏనుగుల కుంభస్థలాలను పగులగొట్టడంలో సామర్థ్యం కలిగినవారం కూడా) అని అంటూ పలికిన శ్లోకాలు ఆత్మ ప్రశంస మూర్తీభవించినట్లుగా గోచరిస్తాయి. వీటికి అన్నిటికి సమాధానం ఏమిటో గమనిద్దాం.

పైన ప్రస్తావించిన శ్రీయామునులు పలికిన ఆత్మప్రశంసా వాక్యాలు విద్యార్థి దశలో వారు పలికిన మాటలు. ప్రతివాదుల గోష్ఠిలో పలికిన వచనాలు, ఇంతకు ముందు ఉదాహరించిన నన్నూల్ సూక్తిలో "తనను తాను పొగుడుకోవడం యుక్తం కాదు కదా" అని పలికినట్లే, తరువాత సూత్రంలో "ప్రభువులను దర్శించడానికి వెళ్లేటప్పుడు విద్వాంసుడు తన పాండిత్యాన్ని ఉన్నది ఉన్నట్లుగా చెప్పుకోవచ్చు. ఒక సభలో వాదించి జయాన్ని పొందవలసిన సందర్భంలో "నా పాండిత్యాన్ని గూర్చి ఏమని అనుకుంటున్నారు? చూడండి!" అని గర్వంగా పలుకవచ్చు. తనను జ్ఞానంలో కొరత కలిగినవాడని ఇంకొకరు నిందించిన సమయంలో కూడా తన యోగ్యతను తానే గొప్పగా చెప్పుకోవచ్చు. తన జ్ఞానాతిశయాన్ని ఉన్నది ఉన్నట్లుగా తెలియజేయనివారిని, మీకు ఏ ఏ శాస్త్రాలు వచ్చు? అని అడిగితే, అప్పుడు తన విద్యా వైభవాన్ని గూర్చి చెప్పుకోవచ్చు" అని అన్నారు. ఆ సూత్రంలో "పులవేఱ్కే" అని అన్నందున, నిజంగా పాండిత్యం కలిగినవారికే ఈ ఆత్మస్తుతి తగినది అని తెలుపబడడం జరిగింది. దీని ప్రకారం శ్రీయామునుల ఆత్మప్రశంస చాలా యుక్తమైనదని స్పష్టమవుతున్నది కదా.

ఇక, భక్తిసారులు, నమ్మాళ్వారులవంటివారి ఆత్మప్రశంస భగవద్గుణానుభవంలోని గొప్పతనంలో ఉండే గర్వాతిశయంవల్ల ఏర్పడినది. అందుచేత ఇది ఆత్మప్రశంసలోకి రానే రాదు. శ్రీవరవరమునులు తిరువాయ్ మొ*ழி* నూ*ற்ற*న్దాది ప్రబంధంలో "కురవై ముదలామ్ కణ్ణన్ కోలచ్చెయల్ గళ్ ఇరవు పగల్ ఎన్నామల్ ఎన్నుమ్ పరవు మనమ్ పె*ற்றே*నెన్ఱు కళిత్తు పేశుమ్ పరాంకుశన్" (రాసక్రీడ మొదలైన

శ్రీకృష్ణుని అందమైన లీలలను రాత్రి పగలు అనే తేడా లేకుండా ఎల్లప్పుడు అనుసంధానం చేసే మనసును పొందాను— అని ఆనందించి గర్వంతో పలికే పరాంకుశులు) అనే సూక్తిలో ఈ విషయాన్ని స్పష్టం చేయడం గమనించవచ్చు.

హనుమంతుడు పలికిన ఆత్మప్రశంసా పరమైన వాక్యాలు ఏ సందర్భంలో ఉన్నాయి? అనే విషయాన్ని గమనించాలి. సముద్రతీరంలో వచ్చి చేరిన వానరవీరులు, తాము సముద్రాన్ని దాటి వెళ్లడానికి, వెళ్లినా, తిరిగి రావడానికి తమకు శక్తి లేకపోవడాన్ని భావించి, మనసులో తల్లడిల్లినప్పుడు, వారికి కల ఆ బాధను తొలగించడంకోసం, ఉత్సాహాన్ని కలిగించడం కోసం కోసం పలికిన మాటలు అవి. ఈ విధంగా హనుమంతుడు పలుకుండా ఉండి ఉంటే, వానరవీరులు అక్కడే ప్రాణత్యాగాన్ని చేసి ఉండేవారు. ఆ విధంగా కాకుండా ఉండడం కోసం సంభవించిన ఈ ఆత్మప్రశంస, చలువ పందిరి వేసినట్లుగా, ధర్మంలోకే అన్వయిస్తుంది అని అంటారు, పెద్దలు. ఈ విధంగా పైన ఉదాహరించిన ఆత్మప్రశంసల వల్ల స్వరూపానురూపమైన నైచ్యానుసంధానానికి కొరత ఏ కొంచెం కూడా లేదు అనే విషయాన్నికూడా ఇక్కడ గమనించాలి.

★★★★

# భగవత్కృప నిర్హేతుకమైనది

భగవత్కృప నిర్హేతుకమా ? సహేతుకమా? అనేది ఒక విచారం. సహేతుకం అని కొందరు అంటారు, నిర్హేతుకం అని అంటారు, తెన్నాచార్య సంప్రదాయంలోనివారు. మనకు ఉండే సద్గుణాలవల్ల, మనం చేసే సత్కార్యాల కారణంగా భగవంతునకు కృప కలుగుతున్నది అని ఒప్పుకుంటే, అది సహేతుకం అవుతుంది. ఆ విధంగా కాకుండా, అదే పుడుతున్నది అని ఒప్పుకుంటే, నిర్హేతుకం అని అన్నట్లు అవుతుంది.

భగవత్కృప తానే స్వయంగా ఆవిర్భవిస్తున్నది— అని ఏ విధంగా ఒప్పుకోవడానికి సాధ్యం అవుతుంది? ఆ విధంగా ఆవిర్భవించేటట్లయితే, అది ఎల్లప్పుడూ అందరి విషయంలోనూ కలగాలి కదా. భగవత్కృపకు లక్ష్యం కానివారు ఏనాడు కూడా లేకుండా కదా ఉండాలికదా. ఆ విధంగా మనకు కనిపించనందు వల్ల, కొన్ని కాల విశేషాలలో కొందరి అధికారుల విషయంలో మాత్రం భగవంతుని కృప కలగడం అనేది గోచరిస్తున్నందున, అప్పుడు ఒక హేతువును పురస్కరించుకొని ఆ కృప కపుడుతున్నది అనే చెప్పాలి. అందుచేత భగవత్కృప సహేతుకమే తప్ప, నిర్హేతుకం అని అనడంలో ఏ విధమైన ఔచిత్యం లేదు— అని సందేహించే అవకాశం ఉన్నది.

ఇక్కడ వాస్తవమైన విషయం ఏమిటి? అంటే, ఆ భగవంతుని ఘనమైన కృపకు హేతువుగా మన దగ్గర ఏమి విషయం ఉన్నది? అని జాగ్రత్తగా, నిశితంగా గమనించి చూస్తే, ఒక అణుమాత్రం లభిస్తే లభించవచ్చు. విషయ ప్రవణులమైన మనం, వారస్త్రీల వెంటపడి, వారితో పాటు ఆలయాలకు వెళ్లడం సంభవించవచ్చు. మనం వయస్సులో ఉండగా, దొంగ గడ్డిని తినే పశువున దండించడం కోసం దాని వెంటపడి వెళ్ళేటప్పుడు, అది ఒక దేవాలయానికి ప్రదక్షిణం చేస్తూ పరిగెత్తిన సమయంలో, దానిని విడువని ఆగ్రహం వల్ల మనం కూడా ఆ ఆలయానికి ప్రదక్షిణ చేయడం సంభవించవచ్చు. శిశుపాలుడు మొదలైనవారివలె, నింద చేయడం కోసం మాటిమాటికి

భగవంతుని నామాలను చెప్పవచ్చు. ఈ విధంగా ఉండే కొన్ని సుకృత విశేషాల కారణంగా ఆ భగవంతుని కృప మనపై ప్రసరించింది అని అంటే, దీనిని పురస్కరించుకొని సహేతుకం అని చెప్పవచ్చునా? కఠినమైన దండనకు తగిన పాపాలను కదా మనం చేశాము! ఇందులో అతి స్వల్పమైన సుకృతం కలసి ఉండడాన్ని పురస్కరించుకొని భగవంతుడు అనుగ్రహిస్తున్నాడు అంటే, అనుగ్రహాత్మకుడైన అతని మనస్సుతో కృప సహేతుకం అయితే కావచ్చు. "ఎన్నన్ది శెయ్ దేనా ఎన్నెంజిల్ తికழ்వదువే" (నా మనసులో భగవంతుడు ప్రకాశించటానికి తగినట్లుగా నేను ఏమి సుకృతాన్ని చేశాను?), "ఎన్ ఉణర్వినుళ్ళే ఇరుత్తినేన్ అదువుమ్ అవనదు ఇన్నరుళే" (నా జ్ఞానానికి విషయంగా భగవంతుని నిలుపుకున్నాను. ఇది కూడా ఆ స్వామి యొక్క మధురమైన కృప వల్లనే), "వెఱిదే అరుళ్ శెయ్ వర్" (భగవంతుడు నిర్హేతుకంగానే అనుగ్రహిస్తాడు) అనే ఇటువంటి సూక్తులను అనుసంధించే మన భావనలో భగవంతుని కృప నిర్హేతుకమే.

మనలో కొన్ని ఆత్మ గుణాలు ఉన్నప్పటికీ కూడా, వాటిని అసత్కల్పంగా భావించి, "అమర్యాదః క్షుద్రః చలమతి రసూయా ప్రసవభూః", (మర్యాద లేని వాడను, క్షుద్రుడను, చంచల మతిని, అసూయాగుణానికి జన్మస్థానం అయినవాడను), "ఈవిలాద తీవినైకళ్ శెయ్ దనన్ కొల్!" (అంతు లేని సాటి లేని దుష్కర్మలను చేశానే! అయ్యో!), "పావమే శెయ్ దు పావి యానేన్" (పాపాలనే చేసి, పాపిష్ఠివాడను అయ్యాను) అనే విధంగా అనుసంధించవలసినది అయినట్లుగా, భగవంతుని కృపకు తగినట్లుగా స్వల్పమైన హేతువులు ఉన్నప్పటికీ కూడా, వాటిని మనం అసత్కల్పాలుగానే భావించడం, ఇవి ఏమీ లేకుండానే అతడు అనుగ్రహం చేయగలిగినవాడు అని భావించడం యుక్తం కనుక, నిర్హేతుకం అనే సిద్ధాంతమే స్థిరంగా నిలుస్తుంది.

దీనికి తరువాత, "భగవంతుని కృప అనే చాలా గొప్ప ఫలానికి ఈ హేతువులు సదృశాలు కావు —అని చెప్పవచ్చునే తప్ప, అది నిర్హేతుకం అనే చెప్పే

అవకాశం ఉన్నదా? అనే ఆక్షేపాలు కూడా ఇక్కడ కలగవచ్చు. జ్ఞానాన్ని కలిగినవారు ఆ విధంగానే అంటారు.

తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని మొదటి శతకంలో ఉండే దశమ దశకంలో భగవంతుని నిర్హేతుక కరుణను ఆళ్వారులు అనుభవించి, గొప్ప అభినివేశాన్ని పొందినట్లుగా మనకు అక్కడ గోచరిస్తుంది. వేదాంత దేశికులు కూడా ఆ సందర్భంలో “అవ్యాజోదారభావాత్” అనే శ్లోకాన్ని అక్కడ అనుగ్రహించారు.

శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో నాల్గవ ప్రకరణం ఆరంభం “త్రిపాద్విభూతిలో భగవంతునకు పరిపూర్ణమైన అనుభవం కలుగుతూ ఉండగా——— “నా ఊరి పేరును చెప్పావు, నా పేరును చెప్పావు, నా భక్తులను ఆదరించావు, వారి దాహాన్ని తీర్చావు, వారు సేద దీనడానికి తగినట్లు నీడను ఇచ్చావు” అనే విధంగా కొన్నిటిని ఆరోపించి పలికి, ఒడిలో మామిడికాయను పెట్టి (కొన్ని సుకృతాలను ఆరోపించి పలికి) ———— జన్మ పరంపరలు అన్నిటిలోనూ యాదృచ్ఛికం, ప్రాసంగికం, ఆనుషంగికం అనే సుకృత విశేషాలను కల్పించి పలికి, తానే వాటిని ఒకటికి పదింతలుగా చేసి అతడు అనుగ్రహిస్తాడు” అనే ఒక ఆశ్చర్యకరమైన చూర్ణికలో భగవంతుని విషయీకారంలోని గొప్పతనం పరమ భోగ్యంగా నిరూపింపబడింది. ఈ సూక్తిలోని మాధుర్యాన్ని గ్రహించిన వేదాంత దేశికులు కూడా ఈ అర్థాన్ని అదే రీతిలో పొదిగి, పరమపద సోపానంలో “అజ్ఞాత యాదృచ్ఛిక ఆనుషంగిక ప్రాసంగిక సామాన్య బుద్ధిమూల సుకృత విశేషాలను వ్యాజంగా పెట్టుకుని విశేషమైన కటాక్షం చేసి “అని ఈ విధంగా అనుగ్రహించారు.

ఈ విషయంలో సారంగా చెప్పే మాటను ఆలకించండి. భగవంతుని వశీకరించుకోవడానికి కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులు ఉపాయాలుగా చెప్పబడ్డాయి అనేది ప్రసిద్ధం. చేతనులను రక్షించడంలో సహజంగానే రుచిని కలిగినవాడైన భగవంతుడు “సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే” (భగవంతుడు సంసారం అనే

తంత్రాన్ని నిర్వహించేవాడు కనుక, రక్షింపడవలసిన జీవుని దగ్గర నుండి అపేక్షను ఎదురు చూస్తాడు) అనే విధంగా ఈ జీవుని వద్దనుండి ఏదైనా కొంచెం ఎదురు చూస్తాడు— అని ఒకవైపు చెప్పబడింది. ఇంకొక వైపు, భగవంతుని సూక్తిని గమనించినట్లయితే, "నాసౌ పురుషకారేణ న చాప్యన్యేన హేతునా, కేవలం స్వేచ్ఛయైవాహం ప్రేక్షే కంచిత్ కదాచన" (ఈ జీవుడు పురుషకారంవల్ల కానీ, లేక, ఇంకొక కారణం వల్ల కానీ రక్షింపబడడం లేదు. కేవలం నా సంకల్పంతోనే నేను ఎప్పుడో ఒక సమయంలో ఎవరినో ఒకనిని స్వేచ్ఛగా అనుగ్రహిస్తాను) అని ఉన్నది. "నేను పురుషకారాన్ని పురస్కరించుకొని కటాక్షించడం లేదు. వేరు ఏ హేతువును పురస్కరించుకుని కటాక్షించడం లేదు. ఏనాడు ఒకనాడు, ఎవరినో ఒక అధికారివి, నా ఇచ్ఛతోనే నేను కటాక్షిస్తాను" అని పైన ప్రస్తావించిన శ్లోకంలోని తాత్పర్యం. ఈ విధంగా పలికే భగవంతుని అనుగ్రహాన్ని సహేతుకం అని భావించటానికి మనం ఎంతటివారం? మన దగ్గర ఒక కారణాన్ని పురస్కరించుకునే భగవంతుడు మనలను రక్షిస్తున్నాడు— అని భావించడం చాలా హేయమే అవుతుంది. "మరువి త్తొ్రుమ్ మనమే తందాయ్" (నిన్ను ఆదరించి కొలిచే మనసును నాకు నీవు అనుగ్రహించావు), "ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్" (నా చెడ్డ మనసును పోగొట్టావు)అనే ఆళ్వారుల అనుసంధానం అంతా కూడా కృత్రిమం కాబోదు.

★★★★

## అభయప్రదానంలో ఒక అభయప్రదానం

శ్రీరామాయణంలో అభయప్రదానం అనేది ఒక ఘట్టం. విభీషణుడు చాలా ఆర్తితో సముద్ర తీరానికి వచ్చి శరణాగతి చేసినప్పుడు, సుగ్రీవమహారాజు మొదలైనవారు అతనిని అంగీకరించకూడదు— అని చాలా బలంగా ఆక్షేపించిన కాలంలో అతని మనసు చాలా భయపడింది. ఆ సమయంలో శ్రీరాముడు అతనికి అభయాన్ని ఇచ్చాడు. అప్పుడు శ్రీరాముడు అనుగ్రహించిన "సకృదేవ ప్రపన్నాయ" అనే చరమశ్లోకంలో "అభయం దదామి" అనే వాక్యం ఉన్నందువల్ల ఆ ఘట్టం అభయ ప్రదానఘట్టం అని వ్యవహరింపబడుతున్నది.

భగవద్రామానుజులు ఒకనాడు ఒక పెద్ద సభలో ఆ ఘట్టాన్ని చాలా విశదంగా ఉపన్యసిస్తూ ఉన్నారు. "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః" (పుత్రులను, భార్యను విడచిపెట్టి, విభీషణుడు శ్రీరాముని శరణు పొందాడు) అనే విధంగా బాహ్యసంబంధాలను పూర్తిగా సవాసనగా విడచిపెట్టి, విభీషణుడు "సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే, నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్" (లోకంలో ఉండే అందరికీ గొప్ప శరణం అయినవాడు, మహాత్ముడు అయిన శ్రీరాముని దగ్గర "విభీషణుడు నిన్ను శరణాగతి చేయడానికి వచ్చాడు" అని నన్నుగూర్చి వేగంగా విజ్ఞాపన చేయండి) అని పలికి, వానర నాయకులను ప్రార్థించగా, వారు ఈ విభీషణుని అనుకూలుడని భావించకుండా, ప్రతికూలునిగానే భావించి, అతనిపై రాళ్లను విసరడం, శ్రీరాముని వద్ద అతనిని గురించి ఆక్షేపించడం మొదలైన పలు దుష్కృత్యాలను చేయడం ఆరంభించారు— అని ఈ విషయాన్ని శ్రీరామానుజులు ఉపన్యసిస్తూ ఉండగా, అప్పుడు ఆనందంగా ఆ ఉపన్యాసాన్ని వింటున్నవారిలో ఒకరైన పిళ్లై ఉఱంగా విల్లి దాసర్ అనేవారు ఆ గోష్ఠిలో లేచి నిలబడి, వెక్కి వెక్కి ఏడుస్తూ, తమ ఒక పెద్ద సందేహాన్ని

విన్నపించి, దీనిని పరిహరించి అనుగ్రహిస్తే తప్ప, ఆ పైన ఉండే వృత్తాంతాన్ని తాము వినలేమని చెప్పారు.

వారు విజ్ఞాపన చేసిన సందేహం ఏమంటే, విభీషణుడు వాస్తవానికి గొప్ప పరమ భక్తుడు. అతనికి ఆర్తి మొదలైన అధికార పూర్తిలో ఏ విధమైన లోటు లేదు. ఆకించన్యం, అనన్యగతిత్వం అనేవి వాస్తవంగానే కలిగినవాడై, మనసు పరిపక్వతను చెందిన భక్తితో వచ్చి చేరిన ఇతనికే భగవంతుని గోష్ఠిలో ప్రవేశం సులభంగా లభించలేదు అని, భగవంతుని అంతరంగ మంత్రులుగా ఉండే వారిచేత చాలా పరిభవాన్ని, ఆక్షేపాన్ని పొందాడని గమనిస్తే, ఆ విభీషణనకు ఉండే అధికారంలో నూటిలో ఒక వంతుకూడా లేని మావంటివారికి భగవదంగీకారాన్ని కలలో కూడా దర్శించడానికి ప్రసక్తి లేదు కదా. అందుచేత మావంటివారు తరించే దారి అనేది ఉన్నదా? లేదా? అని నా మనసు చాలా తల్లడిల్లుతూ ఉన్నది— అని తమ సందేహాన్ని వారు తెలియజేశారు.

ఈ సందేహం వాస్తవానికి అందరికీ కలిగే, కలుగవలసిన, సందేహమే, అయితే, ఆ సమయంలో పిళ్లై ఉఱంగా విల్లి దాసర్ కు మాత్రమే కలిగింది. ఈ సందేహానికి పరిహారము ఏమి? అని తెలుసుకోవడానికి అందరూ కుతూహలాన్ని పొందవలసినదే. వినండి. భగవద్రామానుజులు వెంటనే వారికి పరమతృప్తికరంగా పలికిన సమాధానం ఏమి? అంటే, “విభీషణునివలె మనం భగవంతుని ఆశ్రయిస్తే కదా, ఈ విధంగా సందేహించి, పిడుగు పడినట్లుగా భయపడి బాధపడుతూ నిలవాలి. మనం భగవంతుని కరుణ కోసం ఎదురు చూసేవారం కాదు కదా. మీకు నేను ఉన్నాను. నాకు పెరియనంబి ఉన్నారు” అని.

దీని తాత్పర్యం ఏమంటే, భగవంతుడు మోక్షాన్ని ఇవ్వగలిగిన సమర్థుడే. లేక, ఇంకా ఇంకా సంసారంలోకి గెంట గలిగిన శక్తి కలిగినవాడే. నిగ్రహానుగ్రహాలకు సాధారణమైన స్వాతంత్ర్యాన్ని అతడు కలిగినవాడు అయినందున, అతనిని

ఆశ్రయించినవారికి మనస్సు తడబడుతూ ఉండడం తటస్థిస్తుంది. అతనివలె కాకుండా, అనుగ్రహమే మూర్తీభవించిన ఆచార్యులను ఆశ్రయించినవారికి సందేహగంధం కూడా లేకుండా, గుండెల పై చేయి వేసుకొని నిద్రించడానికి సాధ్యం అవుతుంది —అని తాత్పర్యం.

ఈ అర్థం మహర్షుల వచనంవల్ల కూడా స్పష్టపడుతున్నది. “సిద్ధిః భవతి వా నేతి సంశయో ఽ చ్యుత సేవినామ్, న సంశయో ఽ స్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్” (అచ్యుతుని ఆశ్రయించినవారికి సిద్ధి కలుగుతుందా? లేదా? అనే సందేహం కలుగవచ్చు, కానీ, ఆ అచ్యుతుని భక్తులకు సేవ చేయడంలో ఆసక్తి కలిగినవారికి ఏ విధమైన సందేహం లేదు) అనే ప్రమాణశ్లోకాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలి. దీని భావం ఏమంటే— భగవంతుని ఆశ్రయించినవారికి సద్గతిప్రాప్తి అనే సిద్ధి కలుగుతుందా? లేదా? అనే సందేహం ఉన్నది. తద్భక్తులైన భాగవతులను ఆశ్రయించినవారికి అటువంటి సందేహం కలుగనే కలుగదు— అని.

ఈ విధంగా, వారు వారు తమ ఆచార్యులను ఆశ్రయించి తరించడం అనేది ఉన్నప్పటికీ, “తస్మిన్ రామానుజార్యే గురురితి చ పదం భాతి, నాన్యత్ర” (భగవద్రామానుజులలోనే గురువు అనే శబ్దం ప్రకాశిస్తున్నది, వేరొకరిలో లేదు) అని పూర్వాచార్యులు ఏకకంఠంగా నిశ్చయించి పలికినందున, ఆచార్యులు అనే పదానికి అర్థమై ఉండే స్వభావం భగవద్రామానుజులకు ఒక్కరికే తగినదై ఉన్నందున, వారి శ్రీచరణసంబంధాన్ని అనుక్షణం, అనుదినం చింతిస్తూ ఉండేవారికి విచారలేశం కూడా లేదు— అని తెలిసికోవాలి.

★★★★

## నీళాదేవినిగూర్చిన నిష్కర్ష

ఆళ్వారుల దివ్యసూక్తులలో నీళాదేవినిగూర్చిన ప్రస్తావం మాటిమాటికి కనిపిస్తుంది. "నప్పిన్నై అని కొన్ని చోట్ల, "పిన్నై" అని పలుచోట్ల నిర్దేశం ఉన్నది. "పిన్నైమణాళనై" (పిన్నైకు భర్త), "పిన్నైతోళ్ మణంద పేరాళా" (పిన్నై బాహువులను సంశ్లేషించిన మహానుభావా!), "నప్పిన్నై కాణిల్ శిరిక్కుమ్" (నప్పిన్నై చూస్తే నవ్వుతుంది), "నప్పిన్నై నంగాయ్ తిరువే!తుయిలెழாయ్!"(పూర్ణులారా! నప్పిన్నా! లక్ష్మీస్వరూపిణీ! నిద్ర లే) అని అంటూ "పిన్నై" అని "నప్పినై" అని తిరునామాన్ని నిర్దేశించి చెప్పడమే కాకుండా, ఈ విధంగా నామనిర్దేశం లేకుండానే, "కోవైవాయాళ్ పొరుట్టు ఏఱ్ఱిన్ ఇరుత్తమ్ ఇఱుత్తాయ్" (దొండపండువంటి పెదవిని కలిగిన నీళాదేవి కోసం ఏడు ఎద్దుల మూపురాలను మర్దించినవాడా!), "వంబవిழ் కోదైపొరుట్టా మాల్ విడై ఏழ மడర్ త్త" (సువాసనను కలిగిన కేశాలను కల కన్యకోసం గొప్ప వృషభాలను ఏడింటిని మర్ధించినవాడు), "అన్ఱురువేழమ్ తడవి నీ కొండ ఆయ్ మకళ్ అన్బనే!" (ఆనాడు ఏడు ఎద్దులను అవలీలగా జయించి, నీవు పరిగ్రహించిన గొల్ల కన్యకు ప్రియమైనవాడా!) అని సాధారణంగాను పలికిన సందర్భాలు కూడా అనేకం.

యశోదాదేవికి తోబుట్టువైన కుంభుడనే గోపాలుడు రేపల్లెలో ఉండేవాడు. ఆమెకు కుమార్తెగా జన్మించినది— ఈ నీళాదేవి. జనకచక్రవర్తి తన కుమార్తె అయిన సీతాదేవికి కన్యాశుల్కంగా శివుని వింటిని ఎక్కు పెట్టడాన్ని నిర్ణయించినట్లుగా, కుంభుడు కూడా తన కుమార్తె అయిన నీళాదేవికి, ఏడు ఎద్దులను మర్దించి, స్వాధీనం చేసుకోవడాన్ని కన్యాశుల్కంగా నిర్ణయించాడు. స్వాధీనం చేసుకోవడానికి ఎవరికీ సాధ్యం కాని ఏడు ఎద్దులను ముందు పెట్టి, "వీటి పొగరును అణచినవానికి నా కుమార్తెను నీళాదేవిని ఇచ్చి వివాహం జరిపిస్తా"ననే ఒక వ్యవస్థను అతడు ఏర్పాటు చేశాడు. ఆమె రూపలావణ్యాదులనుగూర్చి విన్న పలువురు ఆమెను వివాహం చేసుకోవాలని ఆశపడి, ఆ ఏడు ఎద్దులను స్వాధీనం చేసికోవడానికి ప్రయత్నం చేయగా,

పిడుగువంటి వాటి రంకెలతోనే వారు అందరూ చాలా దూరానికి పారిపోయి, తిరిగి వెళ్లిపోయారని, శ్రీకృష్ణుడు ఒక్కడే వాటిని అవలీలగా స్వాధీనం చేసికొని, వాటి పొగరును అణచి, నీళాదేవిని వివాహం చేసికొన్నాడని ఒక వృత్తాంతం చెప్పబడుతున్నది.

శ్రీకృష్ణావతారంలో రుక్మిణీసత్యభామలనే ప్రధానమహిషులుగా గ్రంథాలలో నిర్దేశించడం మాత్రమే కాకుండా, అర్చారూపాలలోకూడా ఆ విధంగానే మనం దర్శిస్తున్నాము. ఆళ్వారుల దివ్యప్రబంధాలలో రుక్మిణీదేవికి సంబంధించిన ప్రస్తావం చాలా స్వల్పంగానే కనిపిస్తున్నది. నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో "అన్ఱజ్ఞమర్ వెన్ఱు ఉరుప్పిణి నంగై యణి నెడుంతోళ్ పుణర్ న్దాన్" (7—10—6) (ఆనాడు యుద్ధభూమిలో జయించి, రుక్మిణిదేవి అందమైన, దీర్ఘమైన బాహువులను సంశ్లేషించాడు) అని, పెరియాళ్వార్ తిరుమొళిలో పెరియాళ్వార్లు "ఉరుప్పిణి నంగై తన్నై తేరేఱ్ఱిక్కొండు———" (రుక్మిణీదేవిని రథంపై ఎక్కించుకుని) (3—9—3) అని, "ఉరుప్పిణినంగైతన్నై మీట్పాన్ తొడర్ న్దోడి చ్చెన్ఱ"(4—3—1) (రుక్మిణీ దేవిని తిరిగి తీసుకొని రావడంకోసం వెంబడించి వెళ్ళిన)అని, నాచ్చియార్ తిరుమొళిలో "కణ్ణాలమ్ కోడిత్తు క్కన్ని తన్నై క్కైప్పిడిప్పాన్ తిణ్ణార్ న్దిరుంద శిశుపాలన్ తేశழிన్దు, అణ్ణాందిరుక్కవే అంగు అవన్ కైప్పిడిత్త పెణ్ణాళన్" (11—9) (పెండ్లి ముస్తాబు చేసికొని, రుక్మిణీ దేవిని వివాహం చేసుకోవడం కోసం నిశ్చయం చేసుకున్న శిశుపాలుడు తేజస్సును కోల్పోయి చూస్తూ ఉండగానే, అక్కడ ఆమె పాణిని పరిగ్రహించిన పెండ్లికొడుకు) అని ఈ విధంగా కొన్ని సందర్భాలలో వెదకి చూడవలసిన విధంగా ఉన్నది. నీళాదేవికి సంబంధించిన ప్రస్తావనకే అపరిమితమైన సుభిక్షం ఉన్నది. ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో కూడా "నంగళ్ పంజ త్తిరువడి పిన్నైదన్ కాదలన్" (దూదివలె సుకుమారమైన శ్రీచరణాలను కలిగిన పిన్నైకు ప్రియుడు), అని అంటూ నీళాదేవిని పురస్కరించుకునే భగవంతుని విశేషించి పలకడాన్ని గమనించవచ్చు.

ఈమెకు సంస్కృతంలో ఏమి పేరు? అనే విషయాన్ని తెలియాలి కదా. కూరేశులు, భట్టర్, దేశికులు— అనే ముగ్గురి సూక్తులలో మాత్రమే ఈ నీళాదేవికు సంబంధించిన ప్రస్తావం కనబడుతున్నది. ఈ ముగ్గురూ కూడా ఈమెను "నీళా" అనే నిర్దేశించారు. దీనినిగూర్చి తరువాత వివరిస్తాను. ఈ విషయం అటు ఉండనివ్వండి.

శ్రీకృష్ణపరమాత్మచరిత్రలను మనం తెలుసుకోవడానికి పరమప్రమాణాలుగా ప్రకాశిస్తున్న శ్రీవిష్ణుపురాణం, శ్రీభాగవతం, మహాభారతం మొదలైన ఇతిహాస పురాణాలలో దేనిలోనూ ఈ నీళాదేవికి సంబంధించిన ఇతిహాసం ఏమీ కనిపించడం లేదు. కొంతమంది నాగ్నజితి అనే ఆమె చరిత్రను చూచి, "ఆమెయే ఆళ్వారులు వస్తావించిన నప్పిన్నై ప్పిరాట్టి" అని చెప్పారు అని భ్రమిస్తారు. ఈ విధంగా కొందరు రాశారు కూడా. ఆమె చరిత్రలో ఏడు ఎద్దుల పొగరు అణచడం అనేది ఉన్నదనే కారణం చేత ఈ విధంగా భ్రమిస్తారు. కానీ, ఆమె క్షత్రియకన్యగా నిర్దేశింపబడడాన్ని గమనించాలి. శ్రీకృష్ణుడు రేపల్లెలో నివసించిన కాలంలో ఈమెను వివాహం చేసుకున్నట్లుగా కథ ఉండి ఉండాలి. ఈమె గొల్లకన్యకగా కూడా ఉండాలి. ఈ రెండు అంశాలు అసంభావితాలు అయినందున, ఈమెను నీళాదేవిగా గ్రహించడంలో కొంచెం కూడా ఔచిత్యం లేదు. నీళాదేవిని గొల్లకన్య అనే స్పష్టంగా ఆళ్వారులు నిర్దేశించారు. "ఆయర్ మడమకళ్ పిన్నైక్కాగి అడల్విడై ఏழ்నైయుమ్ వీయ ప్పొరుదు వియర్ న్దు నిన్ఱానై" (4—1—4) (గొల్లకన్య అయిన పిన్నైకోసం పొగరు పట్టిన ఏడు ఎద్దులు నశించే చెట్లుగా పోరాడి, స్వేదాన్ని కలిగినవానిని) అని పెరియాళ్వార్లు, "అన్ఱురు వేழమ్ తడవి నీ కొండ ఆయ్ మగళన్బనే!" (7—2—9) (ఆనాడు ఉరుమువలె గర్జించే ఏడు ఎద్దులను భంజించి, నీవు వివాహం చేసుకొన్న గొల్లకన్యకు ప్రియుడా!) అని నమ్మాళ్వారులు అన్నారు. ఈ విధంగా ఇంకా చాలా పాశురాలు ఉన్నాయి అందుచేత నాగ్నజితిని నీళాదేవిగా మనసుతో భావించటానికి కూడా ఎంత మాత్రం అవకాశం లేదు.

అయితే, ఈమె చరిత్రను ఆళ్వారులు, గోదాదేవి ఏ విధంగా తెలిసికొన్నారు? అనే ప్రశ్న కలుగుతుంది. వేదాంతాచార్యులవారు యాదవాభ్యుదయం అనే కావ్యంలో రేపల్లెలో సంభవించిన సంఘటనలను ప్రస్తావించేటప్పుడు, నాలుగవ సర్గలో 98, 99 అనే రెండు శ్లోకాలతో శ్రీకృష్ణుడు నీళాదేవిని వివాహం చేసుకున్న వృత్తాంతాన్ని వర్ణించారు. ఆ రెండు శ్లోకాలు ఈ విధంగా ఉన్నాయి.

దిశా గజానామివ శాకరాణాం
శృంగారనిర్భిన్నశిలోచ్చయానామ్,
స తాదృశా బాహుబలేన కంఠాన్
నిపీడ్య లేభే పణితేన నీళామ్.

కరేణ దంభోళి కఠోరతుంగాన్
దేహాన్ పృథూన్ దానవదుర్వృషాణామ్,
విమృద్య నూనం విదధే ముకుందః
ప్రియాస్తనస్పర్శవిహారయోగ్యామ్.

ఈ రెండు శ్లోకాలలో, మొదటి శ్లోకం ద్వారా– నీళాదేవిని వివాహం చేసుకోవడంకోసం ఏడు ఎద్దుల పొగరు అణచడం శుల్కంగా నిర్ణయింపబడింది– అని, ఆ విధంగానే, ఆ ఎద్దుల పొగరును అణచి ఆమెను శ్రీకృష్ణుడు వివాహం చేసుకొన్నాడని, నీళాదేవి అనేది ఆమె పేరు అని తెలుస్తున్నది. రెండవ శ్లోకం ద్వారా– ఈ ఎద్దులను తడవడం అనేది నీళాదేవి స్తనమండలాన్ని సంశ్లేషించినట్లుగా ఉన్నది– అని చెప్పడం ద్వారా ఈ అరుదైన గొప్ప కార్యం చాలా అవలీలగా సంభవించింది –అని చెప్పబడింది. ఇక్కడ వ్యాఖ్యానంలో అప్పయ్య దీక్షితులు ఈ కథను కొంచెం వివరంగా వ్రాసి, అది హరివంశంలో ఉన్నట్లుగా కూడా తెలియజేశారు.

"ఏవం హరివంశే కథా. విదేహనగరే యశోదానుజః కుంభకో నామ గవాంపతి రాసీత్. తస్య వ్రజే కాలనేమేః అసురస్య సుతాః సప్త ప్రాక్ భగవతా నిర్జితాః పూర్వవైర మనుస్మృత్య, కృష్ణాపచికీర్షయా వృషభరూపేణ న్యవసన్. తై శ్చ గోకులవిత్రాసన సస్యభక్షణాద్యైః ఉపద్రవేషు క్రియమాణేషు, స్వయం దమయితుమ్ అశక్తేషు చ తేషు, "య ఏషాం దమయితా, తస్మై స్వకన్యాం నీళాం దాస్యామీ"తి కుంభకః ప్రతిజజ్ఞే. తత్ర చ కదాచిత్ కృష్ణః సమాగత్య తాన్ మారయిత్వా నీళాం జగ్రాహేతి.

(హరివంశ పురాణంలో ఈ విధంగా కథ ఉన్నది. విదేహనగరంలో యశోదాదేవికి తమ్ముడు కుంభకుడు అనే గోకుల నాయకుడు ఉండేవాడు. కాలనేమి పుత్రులు ఏడుమంది పూర్వం భగవంతునిచేత ఓడింపబడినవారై, పూర్వవైరాన్ని స్మరిస్తూ, ఏ విధంగా అయినా శ్రీకృష్ణునకు అపకారాన్ని చేయాలని భావించి, ఏడు ఎద్దుల రూపంలో ఆ కుంభకుని గోకులంలో ప్రవేశించి, అక్కడ పంటలను తిని పాడుచేయడం, గోకులంలో ఉండేవారిని భయపెట్టడం మొదలైన ఉపద్రవాలను కలిగిస్తూ ఉన్నారు. వారిని వశం చేసుకోవడానికి సాధ్యం కానందువల్ల, కుంభకుడు "ఎవడు ఈ ఏడు ఎద్దులను స్వాధీనం చేసుకుని, వీటి పొగరును అణుస్తాడో, అతనికి నా కుమార్తెను నీళాదేవిని ఇచ్చి వివాహం చేస్తాను" అనే మాట ఇచ్చాడు. ఒకానొక సమయంలో శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చి, ఆ ఏడు ఎద్దులను మర్దించి, నీళాదేవిని వివాహం చేసికొన్నాడు.)

అయితే, ఎంత వెదకినప్పటికీ, హరివంశంలో ఈ కథ కనపడలేదు. అధికమైన ప్రచారంలో ఉండే శ్రీరామాయణాదులలో ఎన్నో మార్పులు చోటు చేసుకోవడం మనం గమనిస్తున్నాము. హరివంశంలోకూడా ఈ విధంగా చాలా మార్పులు జరిగి ఉండవచ్చు— అని ఇప్పుడు మనం భావించవలసి ఉన్నది. దీక్షితులు హరివంశంలో తాము చూడకుండా ఈ విధంగా వ్రాసి ఉండరు. ఈ విషయం ఏ

విధంగానైనా ఉండనివ్వండి. మూలంలో శ్రీదేశికులు ఈ కథను వ్యక్తంగానే అనుగ్రహించడాన్ని మనం గమనిస్తున్నాము. ఇతిహాస పురాణాలలో ఏదైనా ఒక విషయాన్ని ఆధారంగా గ్రహించకుండా స్వతంత్రంగా వారు వ్రాసి ఉండరు. ధేనుకాసురవధం, కాళియమర్దనం మొదలైన చరిత్రలకు ముందే ఇది సంభవించినట్లు, రేపల్లెలో ఇది జరిగినట్లు దేశికులు తెలియజేయడాన్ని చూసినప్పుడు, ఇది పురాణప్రసిద్ధమైన కథే— అని మనం గ్రహించడంలో ఏ లోటు లేదు.

ఈ దివ్యదేవేరి తిరునామం "నీళా" అనే విషయం పైన ప్రస్తావించిన యాదవభ్యుదయసూక్తి వల్ల తెలుస్తున్నట్లే, పరాశర భట్టర్ శ్రీ సూక్తివల్ల ఆ విధంగానే, కూరేశుల శ్రీసూక్తివల్ల చక్కగా తెలుస్తున్నది. తిరుప్పావై ప్రబంధానికి భట్టర్ అనుగ్రహించిన తనియన్ శ్లోకం "నీలాతుంగస్తనగిరితటీసుప్తమ్" ఇత్యాదిగా ఉన్నది. ఈ శ్లోకంలోని మొదటి భాగం తిరుప్పావై ప్రబంధంలోని ", కుత్తు విళక్కెరియ "అనే పాశురంలోని "నప్పిన్నై కొంగై మేల్వైత్తు క్కిడంద" అనే సూక్తికి అనువాదంగా ఉన్నది. ఈ సూక్తిలో ఉండే "నప్పిన్నై "అనే శబ్దమే "నీళా" అని నిర్దేశింపబడింది అనే విషయం స్పష్టమవుతున్నది. ఆ విధంగానే, కూరేశులు సుందరబాహుస్తవంలో శ్రీకృష్ణావతారస్తుతి పరంగా అనుగ్రహించిన శ్లోకాలలో మొదటి శ్లోకం అయిన "హే సుందరైకతరజన్మని కృష్ణభావే" అనే శ్లోకంలో "నీళా కులేన సదృశీ తవ రుక్మిణీ చ "అని నాల్గవ పాదం ఉన్నది. ఇక్కడ ఉండే "నీళా" అనే శబ్దం నప్పిన్నైను నిర్దేశిస్తున్నది అనే విషయం సుస్పష్టం. భక్తిసార మునీంద్రులు తిరుచ్చంద విరుత్త ప్రబంధంలో అనుగ్రహించిన "ఆయనాగి ఆయర్మంగై వేయతోళ్ విరుంబినాయ్" (41)అనే సూక్తిని అనుసరించియే పైన నిర్దేశించిన సుందరబాహుస్తవశ్లోకం అవతరించినందువల్ల, గొల్లకన్య అయిన నప్పిన్నై పిరాట్టిని కూరేశులు "నీళా" అని నిర్దేశించారు— అనే విషయం నిస్సందేహం.

ఆళ్వార్లు ఏ సందర్భంలోనూ నప్పిన్నైను "నీళా" అనే పదంతో నిర్దేశించలేదు. అటువంటప్పుడు ఈ ఆచార్యులు ఇలా అని నిర్దేశించడానికి ఏమి కారణం? అని ఇక్కడ విచారించవలసి ఉన్నది యాదవాభ్యుదయ వ్యాఖ్యానకర్త అయిన అప్పయ్య దీక్షితులు ఈ నప్పిన్నై వృత్తాంతాన్ని సంస్కృత పురాణంలో చూచినట్లుగా ఇంతకు ముందే తెలియజేయబడింది కదా. ఆ పురాణంలో "నీళా" అనే పేరు ఉండి ఉండాలి. ఇది నేను ఊహాగానంగా చెప్పిన మాట. నా అంతరంగమైన అభిప్రాయాన్ని వినండి.

భగవంతుడు పరమపదంలో శ్రీదేవి, భూదేవి, నీళాదేవి— అనే ముగ్గురు దివ్యదేవేరులతో కూడి ఉంటాడని భగవ. చ్ఛాస్త్రాల వల్ల తెలుస్తున్నది. శ్రీరామాయణంలో సముద్ర శరణాగతి ప్రకరణంలో ఉన్న "భుజైః పరమనారీణామ్ అభిమృష్ట మనేకధా""అనే శ్లోకానికి కల గోవిందరాజీయ వ్యాఖ్యానంలో కూడా దీనిని ఈ విషయాన్ని గమనించవచ్చు. కూరేశులు కూడా శ్రీవైకుంఠస్తవంలోని 78వ శ్లోకంనుండి ఆరంభించి, వరుసగా ఐదు శ్లోకాలతో ఈ ముగ్గురు దివ్యమహిషులను కీర్తించారు. దివ్యసూరులు కూడా, ఆ దివ్యమహిషులను ముగ్గురిని చేర్చి పలికే సందర్భాలలో, "ఉడనమర్ కాదల్ మగళిర్ తిరుమకళ్ మణ్ మగళ్ ఆయర్ మడమగళ్ ఎన్ఱివర్ మూవర్" (తనతో ఎల్లప్పుడూ కలసి ఉండాలని కోరే దేవేరులు అయిన లక్ష్మీదేవి, భూదేవి, గొల్ల కన్య అయిన నీళాదేవి అనే ఈ ముగ్గురు) అని, "కూందల్ మలర్ మంగైక్కుమ్ మణ్ మడందైక్కుమ్ కులవాయర్ కొழுన్దుక్కుమ్ కేళ్వన్"(అందమైన కేశాలను కలిగిన లక్ష్మీదేవికి, భూదేవికి, గొల్లకులానికి చిగురువంటి నీళాదేవికి వల్లభుడు) అని, "కుழల్కోవలర్ మడప్పావైయుమ్ మణ్ మగళుమ్ తిరువుమ్ "(పిల్లనగ్రోవిని నిరూపకంగా కలిగిన గొల్లకులంలో జన్మించిన అందమైన కన్య నీళాదేవి, భూదేవి అనే ఈ ఇద్దరు లక్ష్మీదేవికి నీడవంటివారు) అని ఈ విధంగానే పల్కడాన్ని గమనిస్తున్నాము. భగవచ్ఛాస్త్రాలలో ప్రసిద్ధమైన నీళాదేవిని అళ్వార్లు "ఆయర్ మడమగళ్" అని, "కులవాయర్ కొழுన్దు" అని, "కుழల్కోవలర్ మడప్పావై"

చెప్పినందున, ఆళ్వార్ల మనసులో గొల్లకన్యలలో ఒక్కతె అయిన నప్పిన్నై ప్పిరాట్టియే నీళాదేవి స్థానంలో గ్రహింపబడింది— అని నిస్సందేహంగా తేలుతున్నది. లేకపోతే, పరమపదంలో ఉండే దివ్యపత్నులను పరిగణన చేసి పలికేటప్పుడు "ఆయర్ మడమగళ్" అనే పదాన్ని ప్రయోగించడం ఎంత మాత్రం పొసగదు కదా.

అందుచేత, ఆళ్వారుల మన అభిప్రాయంలో నప్పిన్నై ప్పిరాట్టి నీళాదేవిగా గ్రహింపబడింది— అనేది స్పష్టపడుతున్నందున, దీనిని అనుసరించి మన పూర్వాచార్యులు ఆమెను సంస్కృత భాషలో నిర్దేశించవలసివచ్చినప్పుడు "నీళా" అని నిర్దేశించారు— అని నిశ్చయం చేసుకోవచ్చు.

ద్రావిడసాహిత్యకారులలో ఒకరైన నక్కీరుడు చాలా ప్రసిద్ధిని పొందినవాడు. ఆయనకు సహజమైన పేరు" కీరన్" అనేదే అని, ఔన్నత్యాన్ని సూచించే ఉపసర్గ అయిన, "న" అనే అక్షరాన్ని చేర్చి ఉపచారంగా "నక్కీరన్" అని వ్యవహరింపబడుతున్నారని పెద్దలు అంటారు. "పిన్నై, నప్పిన్నై" అనే సందర్భాలలో కూడా అదే విధంగా అన్వయించుకోవాలి. శ్రీదేవికి, భూదేవికి తరువాత పరిగణింపబడుతున్నది అనే కారణంవల్ల ఈమె "పిన్నై" అని ఆళ్వార్లచేత వ్యవహరింపబడింది.

★★★★

## మూడు దివ్యాల అనుభవమ్

లోకవ్యవహారాలలోనూ, శాస్త్రవ్యహారాలలోనూ చాలా గొప్ప విషయాన్ని చెప్పేటప్పుడు దివ్యం అనే ఒక పదం ఒకటి అందరిచేత ప్రయోగింపబడుతున్నది. “, తదీయారాధన దివ్యంగా ఉన్నది, ఉపన్యాసం దివ్యంగా ఉన్నది, అలాగే, శ్రీరంగనాథుని సేవ అతిదివ్యంగా ఉన్నది” అని ఈ విధంగా అంతటా వ్యవహారాలు కనిపిస్తాయి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు తన అవతారాన్ని, లీలలనుగూర్చి గొప్పగా చెప్పేటప్పుడు “జన్మ కర్మ చ మే దివ్యమ్” అని అన్నాడు. విశ్వరూపాన్ని దర్శించడానికి అర్జునునకు గొప్ప నేత్రాన్ని అనుగ్రహిస్తున్నట్లుగా చెప్పేటప్పుడు శ్రీకృష్ణుడు “దివ్యం దదామి తే చక్షుః” అని అన్నాడు. వీటివల్ల దివ్యపదంలోని గొప్పతనం ఎటువంటిదో తెలియవచ్చు.

1) మన శ్రీవైష్ణవసంప్రదాయంలో ప్రమాణం, ప్రమాత, ప్రమేయం– అని మూడింటిని చెప్పేటప్పుడు దివ్యపదాన్ని చేర్చే చెప్పడం అనేది అనాదిగా వస్తున్నది. ప్రమాణాలలో ఉత్తమమైనది దివ్యప్రబంధం. ప్రమాతలలో ఉత్తములు దివ్యసూరులు. ప్రమేయాలలో ఉత్తమమైనవి దివ్యదేశాలు. ఈ విధంగా అన్నీ దివ్యంగా ప్రకాశించే అందం మన సంప్రదాయానికే అసాధారణ సంపదగా ప్రకాశిస్తున్నది. ఇందులో ఒక విషయం పరిశీలనాత్మకంగా తెలుపబడుతున్నది.

మధురకవి ఆళ్వార్లు, గోదాదేవితో కూడిన ఆళ్వార్లు 12 మంది అనుగ్రహించిన దివ్యప్రబంధాలే నాలాయిర దివ్యప్రబంధం అని వ్యవహరింపబడుతున్నాయి. వీటిలో ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది కూడా చేరి ఉన్నది. తిరుప్పల్లాండు, తిరుప్పావై, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది– అనే ఈ నాలుగు దివ్యప్రబంధాలు అసాధారణమైన ఒక గొప్పతనాన్ని పొందడానికి అర్హత లేనివిగా గోచరిస్తాయి. ఎందుకు? దివ్యప్రబంధాలకు అసాధారణమైన గొప్పతనం ఏది? అంటే, అభిమానస్థలాలు అయిన దివ్యదేశాలను విశేషంగా ప్రస్తావించడమే. భగవంతుని పర వ్యూహ విభవ అంతర్యామి అర్చావతారాలు– అనే ఐదు స్థితులు దివ్యప్రబంధాలలో

ప్రస్తావించి, స్తుతింపబడినప్పటికీ కూడా, అర్చావతారవైభవాలను పలకడంలోనే వీటికి విశేషమైన దృష్టి— అనేది మన పూర్వాచార్యులు నిశ్చయించి చెప్పిన విషయం. వేదానికి పరత్వంలో దృష్టి, ధర్మశాస్త్రాలు అనే స్మృతులకు అంతర్యామిరూపంలో దృష్టి, దివ్యప్రబంధాలకు అర్చావతారంలో దృష్టి— అనే ఈ విషయం ఆచార్యహృదయం అనే గ్రంథంలో "అథవా, వేదవేద్యన్యాయత్తాలే పరత్వపర ముదువేదమ్" (70) అని ఆరంభం అవుతున్న ఒక చూర్ణికయొక్క వ్యాఖ్యానంలో విశదంగా గమనించవచ్చు. మనం దివ్యదేశాల గొప్పతనాలను అనుభవించాలి అంటే, దివ్యప్రబంధాలలో తప్ప వేరు దేనిలోను అనుభవించడానికి సాధ్యం కాదు కదా. అందుచేత దివ్యదేశవైభవాన్ని పూర్తి విశదంగా పలకడమే దివ్యప్రబంధాలకు గల అసాధారణమైన గొప్పతనం— అనేది నిర్వివాదమైన విషయం.

ఇటువంటి గొప్పతనం తిరుపల్లాండు మొదలైన, పైన నిర్దేశించిన నాలుగు దివ్యప్రబంధాలకు ఏర్పడడానికి ప్రసక్తి ఏమీ లేకుండా ఉన్నది. ఎందుకంటే, పెరియాళ్వారులు పాండ్యరాజు సభలో పరతత్త్వ నిర్ణయాన్ని చేసి, వేగంగా వాదశుల్కాన్ని బహుమానంగా సంపాదించి, భద్రగజంపై వీథులలో ఊరేగింపుగా వచ్చేటప్పుడు, ఆ ఉత్సవాన్ని ఎంతో ఆశతో చూడాలని వచ్చిన పరమపదనాథుని దర్శించే, ఆళ్వారులు పల్లాండు పాడి, తిరుప్పల్లాండు అనే దివ్యప్రబంధాన్ని అనుగ్రహించారు. కనుక, అప్పుడు దివ్యదేశప్రశంసను దేనినీ చేసే అవకాశం లేకుండా పోయింది.

2) తిరుప్పావై ప్రబంధం అనేది శ్రీకృష్ణుని విభవకాలంలో నేరుగానే గోపికలు ఆశ్రయించిన రీతిని అనుసరించి అవతరించిన ప్రబంధం కనుక, అందులో కూడా దివ్యదేశకీర్తనను చేసే ప్రసక్తి ఏదీ లేకుండా అయినది.

3) కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధం నమ్మాళ్వారులనే దైవంగా భావించి, వారిని స్తుతించడానికి అవతరించిన ప్రబంధం కనుక,

4) ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధం భగవద్రామానుజులను దైవంగా తలచి, వారిని స్తుతించడంకోసమే అవతరించిన ప్రబంధం కనుక, ఈ రెండిటిలో దివ్యదేశప్రశంసకు అవకాశం అనేది ఏమీ లేకుండా అయినది.

అయినప్పటికీ, "దివ్యదేశప్రస్తావం లేని ప్రబంధం దివ్యప్రబంధం కాబోదు" అని భావించే పైన చెప్పిన నాలుగు ప్రబంధాలలోను ఆ యా ప్రబంధ కర్తలు దివ్యదేశ ప్రశంసను ఒక విధంగా చేశారు.

1) తిరుప్పల్లాండు ప్రబంధంలో దివ్యదేశప్రశంస ప్రస్తావింపబడిన విధం ఏది? అని అంటే, "అల్ వ*ழ*క్కు ఒన్ఱు మిల్లా "అనే పదకొండవ పాశురంలో భాగవతోత్తములైన శెల్వనంబి అనే ఒక పెద్దలను దృష్టాంతంగా ప్రస్తావించాలని భావించి, పెరియాళ్వార్లు, ఆ పెద్దలు తిరుక్కోట్టియూర్ దివ్యదేశంలో నివసిస్తూ ఉన్నందున, దానిని నిర్దేశించే క్రమంలో తిరుక్కోట్టి యూర్ దివ్యదేశప్రశంసను చేశారు. "అణి కోట్టియర్ కోన్ అభిమాన తుంగన్ శెల్వనై ప్పోల" అనే చోట "అణి కోట్టి" అనేది తిరుక్కోట్టియూరును ఉద్దేశించి చేసినదే. ఈ ప్రబంధంలో ఒక విధంగా దివ్యదేశ ప్రస్తావం రావడం కోసమే "అణికోట్టి" అనే శ్రీసూక్తి ప్రయోగింపబడింది అని తెలియాలి. తరువాత ఉండే ఫలశ్రుతి పాశురంలో "విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుంబియ శొల్ "అనే చోట శ్రీవిల్లిపుత్తూరు అనే దివ్యదేశ ప్రస్తావం ఉన్నప్పటికీ, దానితో తృప్తి కలుగలేదు కాబోలు.

2) ఇక, కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలోకూడా దివ్యదేశప్రస్తావం ఒక విధంగా చేయబడింది. ఇందులో, ప్రతిపాశురంలోను "కురుకూర్" అని ప్రయోగించడం ద్వారా ఇది నిర్వహింపబడింది.

3) ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో "కోవలుళ్ మామలరాళ్ తన్నొడు మాయనై "అని, "తెన్నత్తి యూరర్ క*ழ*లిణై క్కీ*ழ* "అని, "కణ్ణమంగై నిన్ఱానై కలై పరవుమ్""అని, "పొన్నరంగమెన్నిల్ మయలే పెరుగుమ్ ఇరామానుశన్" అని, "నిఱై వేంగడప్పొఱ్కున్ఱముమ్" అని, "ఇరుప్పిడమ్ వైకుందమ్ వేంగడమ్ మాలిరుమ్ శోలై

ఎన్నుమ్ పొరుప్పిడమ్" అని ఈ విధంగా పలు పాశురాలలో ప్రాసంగికంగా దివ్యదేశప్రశంస చేయబడినందున, అందులో కూడా దివ్యదేశప్రతిపాదనం ఏ లోటు లేకుండా ప్రకాశిస్తున్నది.

4) ఇక, తిరుప్పావై ప్రబంధంలో దివ్యదేశప్రస్తావం ఏ కొరత లేకుండా ఉన్నది—. అనే విషయాన్ని చూపిస్తాను. వాస్తవానికి తిరుప్పావైలో ఏ దివ్యదేశప్రస్తావం వచ్చే అవకాశం లేదు. "తింగళ్ తిరుముకత్తు చ్చేయిఴైయార్ శెన్ఱిరంజి అంగు అప్పఱై కొండ ఆఱ్ఱై" అని ఆ కాలంలో గోపికలు వ్రతం చేసిన రీతిని ఆ విధంగానే అనుకరించి అనువాదం చేస్తూ అనుగ్రహించిన ప్రబంధం కదా, తిరుప్పావై. ఇందులో ఆ గోపికలు చేయని దివ్యదేశప్రశంసను గోదాదేవి చేసే అవకాశం లేదు కదా. అయితే, యశోదాదేవి శ్రీకృష్ణుని తొట్టిలో పెట్టి, జోల పాటను పాడిన భావనతో పలికే పెరియాళ్వారులు "కుడందై క్కిడందానే తాలేలో!" అని అన్నట్లుగాను, గోపికలు శ్రీకృష్ణుడు చేసే చిలిపి పనులను గూర్చి యశోదాదేవి దగ్గరకు వచ్చి మొఱ పెట్టే రీతిని చెప్పేటప్పుడు, "శాళక్కిరామ ముడైయనంబి శాయ్ త్తు పరుగిట్టి ప్పోందు నిన్ఱాన్" అని పలికినట్లుగాను, "మన్ను కుఱుంగుడియాయ్! వెళ్లఱైయాయ్! మదిళ్ శూఴ్ శోలై మలైక్కరశే !కణ్ణపురత్తముదే ! అడుగ శెంగీరై" అని అంటూ యశోద చేయని దివ్యదేశప్రశంసను ఆళ్వారులు తాము చేసినట్లుగానూ, తిరువాయ్ మొఴి ప్రబంధంలో "శూఴ్ విశుంబు అణిముకిల్" అనే దశకంలో పరమపదానుభవాలనుగూర్చి పలికే నమ్మాళ్వారులు అక్కడ దివ్యదేశప్రస్తావనను చేయవలసిన అక్కర లేకపోయినప్పటికీ, "కుడందైయన్ కోవలన్ కుడి కుడియార్కే" అని అంటూ కుంభకోణక్షేత్ర ప్రశంసను చేసినట్లుగాను, గోదాదేవి కూడా తిరుప్పావై ప్రబంధంలో దివ్యదేశప్రశంసను చేయాలని భావించినందున, పలు విధాలుగా అది ఆ ప్రబంధంలో చోటు చేసుకోవడం తటస్థించింది. అది అసత్యం కాదు. "వల్లానై కొన్ఱానై" అని, "మల్లరై మాట్టియ దేవాదిదేవనై" అని రేపల్లెలో ఉండేవారు ఉదాహరించి ప్రస్తావించడానికి అవకాశం ఏమాత్రం లేని వృత్తాంతాలను ఉదాహరించి

ప్రస్తావించినట్లుగానే, "అరంగత్తరవణైమేల్ అమర్ న్దానై ప్పాడ ఎఱ్రూన్దిరాయ్! అని, "వేంగడత్తెమ్ విత్తగనై ఏత్త వారాయ్" అని పలికి ఉండవచ్చు. "అన్ఱివ్వులగమ్ అళందాయ్ అడి పో*ఱ్ఱి*, శెన్ఱు అంగు త్తెన్నిలంగై శె*ఱ్ఱ*ాయ్ తిఱల్ పో*ఱ్ఱి*" అని అంటూ వేరు అవతారచేష్టితాలను ప్రస్తావించి పలికి, మంగళాశాసనం చేసినట్లుగా, "అరంగత్తరవణమేల్ అమర్ న్దానై అడి పో*ఱ్ఱి*", "మాలిరుమ్ శోలై మాయనై అడి పో*ఱ్ఱి*" అని ఈ విధంగా దివ్యదేశప్రశంసను చేసి మంగళాశాసనం చేసి ఉండవచ్చు. దేవాలయాల ప్రస్తావన ఎంత మాత్రం లేకుండా, తిరుపావైను పూర్తి చేయడం ఏమి? అని విచారణ చేయవలసి ఉన్నది. దీనికి సమాధానాన్ని తెలుపుతున్నాము, ఇక్కడ.

తిరుప్పావైలో దేవాలయాల ప్రసక్తి పూర్తిగా లేకపోయిట్లయితే, దీనిని పెద్దలు దివ్యప్రబంధంగా ఆదరించి ఉండేవారా? అందులో నాలుగు చోట్ల కోయిల్ ప్రసక్తి అందంగా చేయబడింది. "పుళ్ళరైయన్ కోయిలిల్ వెళ్ళ విళిశంగిన్ పేరరవమ్ కేట్టిలైయో" (ఆరవ పాశురం), "తంగళ్ తిరుక్కోయిల్ శంగిడువాన్ "(14వ పాశురం), "కోయిల్ కాప్పానే" (16వ పాశురం) "ఉన్ కోయిలిల్ నిన్ఱు ఇంగనే పోందరుళి (23వ పాశురం) అని ఈ నాలుగు పాశురాలలో కోయిల్ ప్రస్తావం రావడం గమనించవచ్చు సామాన్యంగా ఇక్కడ కోయిల్ అని ఉన్నదే తప్ప, ఏ దివ్యదేశ విశేషం ప్రస్తావించబడలేదే! అనే కొరత అక్కరలేదు. శ్రీరంగదివ్య క్షేత్రానికి ", కోయిల్" అనే అసాధారణమైన పేరు. పెరియాళ్వార్ తమ దివ్యప్రబంధంలో (2—9— 4) "కొండల్ వణ్ణా! ఇంగే పోదరాయే, కోయిల్ పిళ్ళాయ్! ఇంగే పోదరాయే" అని అన్నారు. ఇక్కడ "కోయి " అనే పదం సామాన్యవాచకం కాదు. ఉత్తరదేశం దక్షిణదేశం అంతా కొలిచే శ్రీరంగదివ్యక్షేత్రమే కదా విశేషించి చెప్పబడింది. అయితే, తిరుప్పావై ప్రబంధంలో కోయిల్ అని ప్రస్తావింపబడిన నాలుగు చోట్ల శ్రీ రంగనాథుడు వివక్షితమా? అని ప్రశ్నించవద్దు. అర్థశక్తి అనేది వేరు, శబ్దశక్తి అనేది వేరు. శబ్దశక్తికి సంబంధించిన నిర్వాహం ఇది. "పుళ్ళుమ్ శిలంబిన కాణ్" అనే పాశురంలోను "ఉంగళ్ పు*ழ*క్కడై"

అనే పాశురంలోను అర్చావతారసన్నిధిని ఉద్దేశించే కోయిల్ అనే పదం ప్రయోగింపబడింది– అనేది నిస్సందేహం. ఈ విధంగా తిరుప్పావైలోకూడా దివ్యదేశప్రశంస ఉన్నదని నిరూపింపబడినట్లయినది.

★★★★

## శ్రీభాష్యకారదివ్యసూక్తివిశేషానుభవం

శ్రీకృష్ణపరమాత్మ వాస్తవంగా అవతరించి, వాస్తవమైన అర్థాలను పొదిగి, వాస్తవంగా గీతాశాస్త్రాన్ని అవతరింపజేశాడు— అని శ్రీభగవద్రామానుజ దాసులమైన మనం నమ్ముతున్నాము. స్వామి శ్రీరామానుజులు అనుగ్రహించిన గీతాభాష్యం అవతారికలోను, పైన పలు శ్లోకాల భాష్యంలోనూ ఈ నమ్మకమే మనకు ఉర్జితం అవుతున్నది. శ్రీమత్ శంకరాచార్యస్వామి రచించిన భాష్యంలోని ప్రక్రియ దీనికి విరుద్ధంగా ఉన్నది. వారు, తమ భాష్యంలో "భగవాన్ స్వమాయయా దేహవానివ, జాత ఇవ చ లోకానుగ్రహం కుర్వన్ వక్ష్యతే" అని వ్రాయడాన్ని మనం గమనించవచ్చు. దీనివల్ల భగవంఫతుడు వాస్తవంగా దేహపరిగ్రహం చేయలేదు— అని, నిజమైన అవతారం చేయలేదు అని, మాయతో ఏదో జనాలను భ్రమింపచేశాడని శంకరాచార్యులవారు అభిప్రాయపడుతున్నట్లుగా తెలుస్తున్నది. ఈ విధంగా వీరు అభిప్రాయపడడానికి ఒక కారణాభాసం ఉన్నది. అది ఏమి? అంటే, గీతలో తరువాత భగవానుడు నాలుగవ అధ్యాయంలో తానే తన అవతారాన్ని గూర్చి పలికే సందర్భంలో "ఆత్మమాయయా సంభవామి" అని ఉన్నది. దీనికి వాస్తవమైన అర్థం ఏదో, అది భగవద్రామానుజభాష్యంలో ప్రమాణప్రదర్శనపురస్సరంగా నిరూపింపబడింది. "ఆత్మమాయయా— ఆత్మీయయా మాయయా. ˚మాయావయునం జ్ఞానమ్˚ ఇతి జ్ఞానపర్యాయోఽత్ర మాయాశబ్దః. తథా చాభియుక్తప్రయోగః. ˚మాయయా సతతం వేత్తి ప్రాణినాం చ శుభాశుభమ్˚ ఇతి. ఆత్మీయేన జ్ఞానేన, ఆత్మసంకల్పేనేత్యర్థః. "అని గీతాభాష్యంలో అక్కడ స్వామి అనుగ్రహించిన శ్రీసూక్తులను. వైదికనిఘంటువును, దానిని అనుసరించిన అభియుక్త ప్రయోగాన్ని చూపి, సంకల్పరూపజ్ఞానమే ఇక్కడ మాయాశబ్దార్థం —అని శ్రీరామానుజులు నిర్ణయించారు. ఇదే మహర్షి అభిప్రాయానికి చాలా, తగిన ప్రామాణికమైన అర్థం. శ్రీవిష్ణుపురాణంలో (6—5—8) "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః" అని మాయాశబ్దస్థానంలో ఇచ్ఛాశబ్దాన్ని

నిస్సందేహంగా ప్రయోగించి, భగవానుడు తన ఇచ్ఛతోనే తనకు అభిమతమైన పలు దివ్యమంగళ విగ్రహాలను పరిగ్రహించి, అవతరిస్తున్నాడు —అని చెప్పబడింది.

ఇక్కడ శంకరాచార్యులవారు— "సంభవామి— దేహవానివ భవామి, జాత ఇవ, ఆత్మమాయయా— ఆత్మనః మాయయా, న పరమార్థతః లోకవత్" అని వివరించారు. అరణ్యంలో నీరు లేకపోయినప్పటికీ అక్కడ నీరు ఉన్నట్లుగా అది చూపిస్తుంది కదా ఆ విధంగానే భగవంతుడు కూడా, తాను నిజానికి దేహపరిగ్రహం చేయనివాడు కనుక, తాను దేహపరిగ్రహం చేయకపోయినప్పటికీ, ఆ విధంగా దేహపరిగ్రహం చేస్తున్నట్లుగా మాయతో ప్రదర్శిస్తున్నాడు— అని శంకరాచార్యులవారి అభిప్రాయం. "మాయా" అనే పదానికి "అసత్యం" అనేదే వీరు గ్రహించిన అర్థం. తరువాత, నాలుగవ అధ్యాయంలోని తొమ్మిదవ శ్లోకంలో "జన్మ కర్మ చ మే దివ్యమ్, ఏవం యో వేత్తి తత్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సో ఽ ర్జున" అనే సూక్తిలో భగవంతుడు స్వయంగా "నా అవతారాలను, అవతార లీలలను సత్యాలని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతడు వర్తమానదేహాన్ని విడచిపెట్టి, మళ్ళీ వేరొక జన్మను పొందకుండా, నన్నే పొందుతాడు" అని చెప్పాడు. "మే జన్మ కర్మ చ తత్త్వతః యో వేత్తి" అని ఉండడాన్ని స్వమతప్రతికూలంగా భావించిన శంకరాచార్యులవారు చాలా చాతుర్యంగా వేరు విధంగా అన్వయాన్ని చూపించారు. తత్త్వతః" అనేదానిని ", యో వేత్తి "అనే చోట కలుపకుండా, "తత్త్వతః దేహమ్" అని ఉత్తరార్ధంలో అన్వయించి అర్థాన్ని చెప్పారు. వారు ఇంత శ్రమం ఎందుకోసం పడ్డారంటే, సంభవామి ఆత్మ మాయ అని ఉండే చోట మాయా శబ్దానికి, తాము గ్రహించిన అర్థమే సరి అయిన అర్థం— అనే ఒక అభినివేశం వల్లనే.

ప్రామాణికులు ఇక్కడ మధ్యస్థంగా ఆలోచించి గమనించాలి. తైత్తిరీయ యజుర్బ్రాహ్మణంలో కాఠకం అనే భాగంలోని మూడవ ప్రశ్నలో "యావంతః పాంసవో భూమే సంఖ్యాతాః దేవమాయయా" అని అధ్యయనం చేయబడుతున్నది. భూమిలో

ఉండే మట్టి రేణువులు అన్నీ దేవతల మాయచేత లెక్కపెట్టబడినవిగా ఇందులో చెప్పబడుతున్నది. ఇక్కడ "మాయా" శబ్దానికి ఇతరులు చెప్పే అర్థం ఎంత మాత్రం పొసగదు— అనేది స్పష్టం. భూమిలో ఉండే మట్టి కణాలను మానవుల జ్ఞానంతో లెక్కించడం సాధ్యం కాకపోయినప్పటికీ, దేవతల జ్ఞానంతో లెక్కించటానికి సాధ్యంగానే ఉన్నందున, ఇక్కడ "దేవమాయయా" అని పదానికి దేవతల జ్ఞానంతో— అనేదే అర్థం— అని అందరూ నిరాక్షేపంగా అంగీకరించినదే. విద్యారణ్యులు మొదలైన వేదభాష్యకారులు కూడా ఈ విధంగానే ఇక్కడ అర్థాన్ని వివరించారు అందుచేత "మాయా" అనే దానికి "మిథ్యా" అని అర్థాన్ని గ్రహించడం తగినది కాదు— అని తెలుస్తున్నది.

అసురులు, రాక్షసులు మొదలైనవారు చేసే పనులను "మాయా" అని చెప్పడం ఉన్నది. అక్కడ "మిథ్య" అనే అర్థం లేదు. "ఆశ్చర్యకరం" అనే అర్థాన్ని ఉద్దేశించే అక్కడ మాయాశబ్దప్రయోగం చేయబడింది శ్రీపిళ్లైలోకాచార్యులవారు తత్త్వత్రయమనే గ్రంథంలో అచిత్ప్రకరణంలో (10) "మాయై ఎన్గిఅదు విచిత్రసృష్టియై పణ్ణుకైయాలే" అని అనుగ్రహించిన సందర్భంలో, వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు "అసురరాక్షసాదుల కార్యాలు ఆశ్చర్యకరంగా ఉండడాన్నిబట్టి మాయా శబ్దంతో చెప్పేటట్లుగానే, దీనిని కూడా, అంటే, ప్రకృతిని కూడా "మాయ" అని అనడం ఎందుకంటే, విచిత్రసృష్టిని చేస్తున్నందువల్ల, అంటే, ఒకదానివలె ఇంకొకటి ఉండకుండా ఉండే విధంగా, ఆశ్చర్యాన్ని కలిగించే పలు కార్యాలను జనింపచేయడం— అని అనుగ్రహించడం ఈ సందర్భంగా అనుసంధేయం. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" (7—14) అనే శ్లోకంలోని భాష్యంలో శ్రీరామానుజులు దీనిని చాలా విశదంగా నిరూపించారు.

"అస్య మాయాశబ్దవాచ్యత్వమ్ అసురరాక్షసాదీనామివ విచిత్రకార్యకరత్వేన. ———అతో మాయాశబ్దో న మిథ్యార్థవాచీ. ఐంద్రజాలికాదిష్వివ. కేనచిత్ మంత్రౌషధాదినా మిథ్యార్థవిషయాయాః పారమార్థిక్యా ఏవ బుద్ధే రుత్పాదకత్వేన

మాయవీతి ప్రయోగః. తథా మంత్రౌషధాదిరేవ తత్ర మాయా” అని మొదలైన దివ్యసూక్తులు అక్కడ అనుసంధించదగినవి మాయాశబ్దంయొక్క వాస్తవార్థాన్ని తెలియలేక, తప్పయిన అర్థాలను గ్రహించడంవల్లనే మాయావాదుల వాదాలు చాలా చాలా వృద్ధి చెందాయి.

శ్రీకృష్ణుడు అవతరించడం అసత్యం, దేహపరిత్యాగం చేయడం కూడా అసత్యం— అని చెప్పే పక్షంలో, గీతాశాస్త్రం అవతరించడం కూడా అసత్యమనే చెప్పినట్లు అవుతుంది. అసత్యమైన శాస్త్రం మన ఉజ్జీవనానికి ఏ విధంగా సాధనం అవుతుంది?

భగవద్గీతలోని రెండవ అధ్యాయంలో 12వ శ్లోకంనుండి గీతాశాస్త్రం ఆరంభం అవుతున్నది— అని చెప్పవచ్చు. దానికి ముందు ఉన్న భాగం అంతా అవతారికగా ఏర్పడింది. ఆ 12వ శ్లోకం ఏ విధంగా ఉన్నది? అని చూడాలి. “న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః, న చైవ న భవిష్యామో సర్వే వయమతః పరమ్” అనేది ఆ శ్లోకం. దీని అర్థం ఏమంటే— “సర్వేశ్వరుడను అయిన నేను దీనికి ముందు గడచిన అనాదికాలంగా ఉన్నవాడనే. ఓ అర్జునా! నీవు,

ఈ ప్రభువులు అనే క్షేత్రజ్ఞులు కూడా ఇంతకుముందు ఉన్నవారే. ఇంతకు ముందు ఉండడం మాత్రమే కాకుండా, ఇక రాబోయే కాలం అంతా కూడా నేను, మీరు ఉండబోయేవారే “అని అర్థం. సర్వేశ్వరుడనై, పరమాత్మ అయిన నేను నిత్యుడను— అని అనడంలో ఏ విధంగా సందేహం లేదో, ఆ విధంగానే క్షేత్రజ్ఞులై, జీవాత్మలైన మీరు కూడా నిత్యులు— అని అనడంలో సందేహం లేదు— అని, భగవానుడు స్వయంగా నోరు తెరిచి అన్నాడు. దీనివల్ల సర్వేశ్వరుడైన భగవంతుని కంటే జీవాత్మలకు ఉండే భేదం, ఆ జీవత్మాల మధ్య పరస్పరం ఉండే భేదం పారమార్థికం— అని భగవంతుడు స్వయంగా, వ్యక్తంగా చెప్పినట్లు ఏర్పడుతున్నది. ఈ శ్లోకం విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూలమై ఉన్నదని తెలియవచ్చు. మన భాష్యకారులు ఈ శ్లోకానికి అనుగ్రహించిన భాష్యం చాలా విపులంగా ఉన్నది.

దీనికి ముందు అర్జునుడు "పృచ్ఛామి త్వామ్ ధర్మసమ్మూఢచేతాః, యచ్ఛ్రేయః స్యాత్ నిశ్చితం బ్రూహి తన్మే శిష్య స్తే ऽ హం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని తత్త్వార్థాలను తెలియనందు వల్ల తాను మోహాన్ని పొందినట్లుగాను, తన మనసులోని కలత తీరేటట్లుగా తత్త్వార్థాన్ని నిశ్చయించి అనుగ్రహించాలని పలికి, పాదాలలో పడి ప్రార్థించాడు. అటువంటివానికి తత్త్వోపదేశం చేయగా, ఈ గీతాశాస్త్రం అవతరించింది, గీతాచార్యుడు కలత చెందినవానికి ఉపదేశం చేసేటప్పుడు, స్పష్టమైన విషయాలను ఉపదేశిస్తాడు తప్ప, అస్పష్టమైన, దోషాలను కలిగిన విషయాలను చెప్పడు కదా. అందుచేత, ఈ శాస్త్రంలో చెప్పబడే అర్థాలు అన్నీ కూడా పూర్తిగా పారమార్థికాలు— అని వైదికులు భావిస్తారు. అందులోనూ, ఆరంభశ్లోకమైన ఇందులో చెప్పబడిన విషయం ఉపనిషత్తులు మొదలైనవాటిలో వడికట్టిన అర్థంగానే ఉండి ఉండాలి. ఇందులో జీవాత్మ పరమాత్మల భేదం మొదలైనవి చెప్పబడినవి అన్నీ అపారమార్థికాలుగా ఉండడంలో ఏ మాత్రం ఔచిత్యం లేదు. అందుచేత, ఈ నిరూపణాలద్వారా స్వామి శ్రీరామానుజులు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, గీత మొదలైనవాని అర్థాలను అర్జవంతో తెలిసికొని నిశ్చయించారు— అనేది నిష్పక్షపాతంగా ఆలోచించేవారికి కరబదరికా న్యాయంలో సుస్పష్టం అవుతుంది. ఈ గొప్పతనం గొప్పగా ప్రకాశించేటట్లుగానే యతిరాజసప్తతిలో "యథాభూతస్వార్థా యతినృపతిసూక్తిః విజయతే" అని వేదాంతదేశికులవారిచే యుక్తంగా చెప్పబడింది.

★★★★

## చక్రవర్తి వలె కోల్పోవడానికి పనికి వస్తుంది

ముముక్షుప్పడి చరమశ్లోక ప్రకరణంలో "చక్రవర్తియైపోప్పలే ఇఝక్కైక్కు ఉఋప్పు" (దశరథ చక్రవర్తి వలె కోల్పోవడానికి పనికి వస్తుంది) అని అనుగ్రహించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు దశరథ చక్రవర్తిని కోల్పోయినవానినిగా పలికారు. దీనిని గూర్చి వివరిస్తాను.

శ్రీరామాయణం అయోధ్యాకాండలో దశరథ చక్రవర్తియొక్క సత్యవాదిత్వ వృత్తాంతం చాలా అతిశయాన్ని కలిగి ఉన్నది. చక్రవర్తి సత్యవాది అయినందువల్ల, కైకేయి వర ప్రార్థనను మరచిపోలేక, కాదనలేక, శ్రీరాముని అరణ్యానికి పంపించి, సత్యవాదిత్వ మహా కీర్తిని పొందాడు— అని చెప్పబడుతున్నది. కైకేయి యొక్క వర ప్రార్థనను గూర్చిన వృత్తాంతాన్ని ముందుగా వివరిస్తాను.

దండకారణ్యంలో వైజయంతం అనే పట్టణంలో నివసించేవాడు, తిమిధ్వజుడు అనే మాఱు పేరును కలిగినవాడు, ఇంద్రుని జయించినవాడు అయిన శంబరాసురుని, ఇంద్రుని ప్రార్థనను అనుసరించి జయించడం కోసం కైకేయితో పాటు వెళ్లిన దశరథ చక్రవర్తి, ఆ అసురుని ఎదిరించి చేసిన గొప్ప యుద్ధంలో అతని చేత గాయపడి మూర్ఛను పొందినప్పుడు, ఆ చక్రవర్తిని ఆ అసురులు వధించకుండా ఉండేటట్లు కైకేయి యుద్ధరంగంలో నుండి తీసికొని పోయి రక్షించగా, మూర్ఛ నుండి తేరుకున్న దశరథుడు తనకు కైకేయి చేసిన మహోపకారానికి చాలా సంతోషించి, తాను ఆమెకు ఆమె కోరిన రెండు వరాలను ఇస్తానని మాట ఇచ్చాడు. ఆమె వాటిని అప్పుడే కోరుకోకుండా, తరువాత తనకు కావలసినప్పుడు అడిగి పొందుతాను— అని చెప్పింది. సీతాకళ్యాణం తరువాత, చాలా కాలం గడిచి, దశరథుడు శ్రీరామునకు యువరాజ పట్టాభిషేకం చేయాలని ప్రయత్నం చేస్తున్నప్పుడు, మంథర పన్నాగంతో మనస్సులో మార్పును పొందిన ఆ కైకేయి, దశరథ చక్రవర్తిని చూసి, పూర్వం అతడు తనకు మాట

ఇచ్చిన రెండు వరాలకు ఫలంగా తన కుమారుడైన భరతునకు పట్టాభిషేకం చేయాలని, కౌసల్యాకుమారుడైన శ్రీరాముని 14 సంవత్సరాల కాలం అరణ్యాలకు పంపించాలని పలికి బలవంతం చేయగా, ఆమె మాటలను విని చాలా బాధపడిన దశరథుడు, సత్యవాది అయినందున, పూర్వం ఆమెకు వరం ఇచ్చిన మాటను తప్ప లేక శ్రీరాముని వనవాసానికి అంగీకరించాడు— అనేది కథాక్రమం.

ఇక్కడ మనం ముఖ్యంగా గమనించి చూడవలసినది ఒకటి ఉన్నది. కైకేయికి దశరథుడు వరం ఇచ్చిన కాలం చాలా పురాతనం. ఆ వరం "ఇటువంటి వరం" అని నిర్దేశించి చెప్పబడలేదు కూడా. అది ఆ విధంగా ఉండగా, ప్రకృతంలో అయితే, శ్రీరామునకు చక్రవర్తి తానే స్వయంగా రాజ్యప్రదానం చేయడం జరిగింది. అయోధ్యాకాండం మూడవ సర్గలో (39వ శ్లోకం)

"జ్యేష్ఠాయా మసి మే పత్న్యా సదృశ్యాం సదృశః సుతః,
ఉత్తమః త్వం గుణశ్రేష్ఠో మమ రామాత్మజః ప్రియః,
త్వయా యతః ప్రజా శ్చేమాః స్వగుణై రనురంజితాః,
తస్మా త్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి"

అనే ఈ శ్లోకాలు దశరథ చక్రవర్తిచేత శ్రీరామునకు రాజ్యప్రదానం చేయబడిన విషయాన్ని స్పష్టంగా చెబుతున్నాయి. ఇంత మాత్రమే కాదు. మళ్ళీ కూడా సుమంత్రుని పంపించి, శ్రీరామచంద్రుని పిలిపించి, కొంచెం కూడా ఆలస్యం లేకుండా చాలా శీఘ్రంగా రాజ్యపటాభిషేకం చేసికొనేటట్లుగా దశరథుడు బలవంతం చేసిన విషయం కూడా తరువాత నాలుగవ సర్గలో చాలా వివరంగా చెప్పబడింది. ఈ విధంగా ఒక సారికి పలుమార్లు శ్రీరాముని పిలిపించి రాజ్యప్రదానం చేసిన తరువాత, దీనికి విరోధం లేని విధంగా కైకేయియొక్క వరాన్ని అతడు నెరవేర్చాలి తప్ప, శ్రీరామునకు

ఇచ్చిన మాటను ఉపమర్ధించి, వేరుగా ప్రవర్తించడంలో ఏదైనా ఔచిత్యం ఉన్నదా? అని గమనించి చూడాలి.

కైకేయికి రెండు వరాలు ఇచ్చిన కాలంలోనే వరస్వరూపం నిశ్చయింపబడి ఉన్నట్లయితే, దానికి ప్రాబల్యం చెప్పడానికి అవకాశం ఉన్నది. శంబరాసుర యుద్ధ కాలంలో "కైకేయీ! నీవు కోరిన రెండు వరాలను పొందు "అని చక్రవర్తి చేత చెప్పబడింది. "అయోధ్యా రాజ్యాన్ని నా కుమారునకు ఇవ్వాలి, కౌసల్యాపుత్రుని వనాలకు పంపించాలి "అని అప్పుడే కైకేయి చేత అడుగబడి ఉంటే, ఆ వరప్రదానం ప్రాబల్యాన్ని పొంది ఉంటుంది అప్పుడు శ్రీరాముడు కానీ, భరతుడు కానీ పుట్టలేదు కనుక, ఆ విధంగా కోరడానికి అవకాశం లేకుండా పోయింది. శ్రీరామునకు యువరాజ పట్టాభిషేకం చేయాలని ప్రయత్నించినప్పుడే, ఆ వార్తను తెలుసుకొని, "నా కుమారునకు రాజ్యం ఇవ్వాలి, శ్రీరాముని వనవాసిని చేయాలి" అని కైకేయి అడిగి ఉన్నట్లయితే, ఆ మాట ఒప్పుతుంది. శ్రీరామునకు రాజ్యం ఇస్తానని మాట ఇచ్చి పూర్తి అయినది. అతడు కూడా రాజ్యాన్ని పొందడానికి తగిన కార్యకలాపాలను అనుష్ఠించి పూర్తి అయినది. ఈ స్థితిలో, కైకేయి వచ్చి, ఏనాడో తనకు మాట ఇవ్వబడిన రెండు వరాలకు ఫలంగా రామ వివాసాన్ని కోరినట్లయితే, దీనిని దశరథుడు నెరవేర్చి తీరవలసిన ఆవశ్యకత ఏమున్నది? ఆమె కోరికను ఒక విషయంగా లెక్కించకుండా, "కైకేయీ! నీవు కోపగృహంలోనే పడి ఉండు. "అని చెప్పి లేచిపోయి, శ్రీరామ పట్టాభిషేకం మహోత్సవాన్ని ఏ లోటు లేకుండా నెరవేరిస్తే, అప్పుడు చక్రవర్తి యొక్క సత్యవాదిత్వానికి ఏదైనా లోటు వస్తుందా? ఏమి రాదు. "సగం రాజ్యం శ్రీరామునకు చెందనీ, సగం రాజ్యం భరతునకు చెందనీ" అని చెప్పవచ్చు. ఇంకా పలు విధాలుగా చెప్పవచ్చు. శ్రీరామునకు ఇచ్చి వేసిన రాజ్యాన్ని లేకుండా చేసి, అతనిని అరణ్యాలకు వెళ్లేనట్లుగా చేయడం చక్రవర్తిని అసత్యవాదిగా చేస్తుందే తప్ప, సత్యవాదిగా చేస్తుందా? అని శంకించే అవకాశం ఉన్నది.

శ్రీరామాయణ మహార్ణవంలో లోతుగా దిగి, అద్భుతమైన విచారణలను చేస, పరమార్థాలను గ్రహించగలిగిన మహామతులు ఇక్కడ సంప్రతిపన్నమైన శంకాపరిహారాన్ని చేయాలి. నాకు తెలిసినంతవరకు కొన్ని విషయాలు ఇక్కడ ప్రస్తావన చేస్తాను.

"చక్రవర్తియైపోలే ఇఴక్కైక్కు ఉఋప్పు" అని పలికిన చోట వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు "ఇంతకు ముందే వరప్రదానాన్ని చేసి, ఇప్పుడు కాదనడం ఉచితం కాదు —అని తలచి, ఆభాసమైన సత్య ధర్మాన్ని ఆశ్రయించి, "రామో విగ్రహవాన్ ధర్మః" అనే శ్రీరామునితో కలసి ఉజ్జీవించి, పొందదగిన ప్రాప్యాన్ని కోల్పోయిన చక్రవర్తి వలె" అని అనుగ్రహించారు.

ఇక్కడ "ఆభాసమైన సత్యధర్మం"— అనేదానికి రెండు విధాలైన తాత్పర్యాలు ఉన్నాయి. "సత్యం పలకడం"అనేది ధర్మం అయినప్పటికీ, ఒకవైపు తట్టలో భగవంతుని పెట్టి, మరొక వైపు తట్టలో సత్యాన్ని పెట్టి గమనించి చూసినప్పుడు, సత్య వచనం అనేది భగవంతుని కోల్పోవడానికి తగినది అయితే, అది నిజమైన సత్యధర్మం కాదు. అది ఆభాసమైన ధర్మమే— అనేది ఒక తాత్పర్యం.

దశరథుని సత్యవాదిత్వం వస్తుస్థితిలో ధర్మం కాదు, ధర్మాభాసమే, అది అసత్య పర్యవసితమే — అనేది ఇంకొక తాత్పర్యం.

"సర్వ ధర్మాన్" అనేదానికి అర్థం వివరించేటప్పుడు, వీటిని ధర్మం అనడం భ్రమించిన అర్జునుని అభిప్రాయంతో. — అనే పలికిన రీతిలో దశరథ చక్రవర్తిని సత్యవాది అని అనడం, భ్రమించిన అతని అభిప్రాయంతో— అని చెప్పవచ్చు.

గీతాశాస్త్రాన్ని ప్రకాశనంచేయడానికి సమయం కోసం వేచి ఉన్న శ్రీకృష్ణ పరమాత్మ యుద్ధసన్నద్ధుడై యుద్దరంగంలోకి వచ్చి నిలచిన అర్జునుని భ్రమను పొందేటట్లుగా చేసినట్లుగానే, దేవకార్యాన్ని నిర్వహించడం కోసం వనప్రస్థాన కుతూహలిగా ఉండే శ్రీరామ చంద్రమూర్తి తన మనస్సు నెరవేరడం కోసంగా దశరథ

చక్రవర్తికి ఆధర్మంలో ధర్మబుద్ధిని, ధర్మంలో అధర్మ బుద్ధిని కలిగించాడు— అని చెప్పడంలో ఏ లోటు లేదు.

"కాశీలో దొంగతనం చేయడం కోసం కంచిలో కన్నం చేయడం" అనే ఒక వినోదమైన మాట వ్యవహారంలో ఉన్నది. ఆ క్రమంలో పురాణ కథలు ఏర్పడి ఉన్నాయి. "వేండి త్తేవర్ ఇరక్క వందు పిఱందదుమ్" (దేవతలు ప్రార్థించగా ఈ లోకానికి వచ్చి జన్మించడం కూడా) అనే విధంగా దేవతల ప్రార్థనను ఒక నెపంగా చేసికొని పరమ పురుషుడు ఈ భూలోకంలోకి వచ్చి అవతరించాలని అభిప్రాయపడడానికి చాలా దినాలు ముందుగానే, కొన్ని సందర్భాలు జరిగేటట్లు చేస్తాడు. శంబరాసుర యుద్ధంలో దశరథునకు పరాజయం కలిగే అవకాశమే లేదు. అది ఏర్పడేటట్లు, అప్పుడు అతనికి కైకేయి సహాయం చేసేటట్లు, అప్పుడు ఆమెకు అతడు రెండు వరాలు ఇచ్చేటట్లుగా ముందుగా చేయడం అనేది అంతా భగవంతుని కృత్యమే. కైకేయి వరాన్ని అడిగేటప్పుడు భరతుడు అయోధ్యలో ఉండి ఉన్నట్లయితే, శ్రీరామునకు వనవాసం ఏర్పడే అవకాశం లేదు కదా. ఆ విధంగా సత్య సంకల్పుడైన అతని సంకల్పం మూలంగా జరిగిన వాటిలో ఇప్పుడు మనం తెలుసుకొని విచారించి చెప్పడానికి ఏమి ఉన్నది కనుక! పారమార్థిక దృష్టిలో దశరథుడు సత్యవాది కాదు— అని చెప్పడంలో ఏమీ లోటు లేదు. అందువల్లనే అతనిని గూర్చి శ్రీరామానుజులు పలికిన దివ్యసూక్తి ఒకటి ప్రసిద్ధంగా ఉన్నది. "దశరథచక్రవర్తికి నరకమే లభించడం తగినది. భగవంతుని ఆనృశంస్యంచేత అతడు స్వర్గానికి పోయాడు, అంతే "అనేది ఆ సూక్తి.



# శ్రీరామాయణవైభవమ్

మునులు అందరూ గ్రంథాలను రచించలేదు. చాలామంది మునులు తపస్సు చేయడంతోనే నిలచిపోయారు. గ్రంథాలను రచించిన మునులలో కొంతమంది స్మృతి గ్రంథాలను రచించారు. మరికొంతమంది ఇతిహాసాలను, ఇంకా కొంతమంది పురాణాలను రచించారు. స్మృతులు అంటే— ధర్మశాస్త్రాలు. అవి కర్మకాండను గూర్చినవి కనుక, అవి కర్మాచరణలకు ఉపాదేయాలుగా ఉంటాయి. ఇతిహాసాలు, పురాణాలు మాత్రమే బ్రహ్మను గూర్చిన విచారం చేయడం కోసం ఆవిర్భవించాయి. కర్మకాండ విచారపరాలైన స్మృతులు మనకు ఉపాదేయాలు కావు అని భావించకూడదు. ఆచారకాండం, వ్యవహారకాండం, ప్రాయశ్చిత్తకాండం, శ్రాద్ధకాండం, ఆశౌచకాండం— అని ఈ విధంగా ఉండే విభాగాలకు మూలమైన స్మృతులు కూడా మనకు ఉపాదేయాలే అవుతున్నాయి. బ్రహ్మకాండకు ఉపబృంహణాలుగా అవతరించిన ఇతిహాసపురాణాలలో, ఇతిహాసమే ప్రబలం— అని మన పూర్వాచార్యులు నిశ్చయించారు. శ్రీవచనభూషణ మహాగ్రంథంలో "ఇవై ఇరండిలుమ్ వైత్తుకొండు ఇతిహాసమ్ ప్రబలమ్" (ఇతిహాసాలు పురాణాలు అనే ఈ రెండిటిలో, ఇతిహాసం ప్రధానమైనది) అనే చూర్ణికకు అనుగ్రహించిన వ్యాఖ్యానంలో శ్రీవరవరమునులు ఇతిహాస ప్రాబల్యాన్ని ఉపపాదించడాన్ని గమనించవచ్చు. ఇతిహాసాలు రెండిటిలో, శ్రీరామాయణం ముఖ్యమైనది. లోకంలో ఇంచుమించుగా, ఈ కథలోని స్వారస్యంకారణంగా దీనిని ఆదరిస్తున్నారు. వాస్తవానికి ఇది కథాప్రధానమైన గ్రంథం కాదు. అరుదైన గొప్ప అర్థవిశేషాలే దీనికి జీవనాడి అవుతున్నాయి. "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" (వేదాల చేత తెలియదగినవాడైన పరమాత్మ దశరథునకు కుమారుడుగా జన్మించగా, వేదం వాల్మీకి మహర్షి ద్వారా రామాయణ రూపంలో అవతరించింది) అని అంటూ మూడు మతాలకు

చెందినవారు కూడా శ్రీరామాయణానికి ప్రార్థనా శ్లోకంగా అనుసంధించే ఈ శ్లోకరత్నం వేదమే రామాయణంగా రూపాన్ని పొందింది— అని చెబుతున్నది. "వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః" (వేదోపబృంహణ రూపమైన శ్రీరామాయణాన్ని ప్రచారం చేయడం కోసం ప్రభువైన వాల్మీకి కుశలవులు అనే ఆ ఇద్దరిని గ్రహించాడు) అని శ్రీరామాయణంలో ఉండే శ్లోకం దీనిని వేదవ్యాఖ్యాన రూపం అని తెలుపుతున్నది. ఈ శ్లోకంలో "తౌ అగ్రాహయత" అంటే— ఆ కుశలవులకు శ్రీరామాయణ నేర్పించాడు— అని అర్థం. ఎందుకు నేర్పించాడు? అని అంటే, "వేదోపబృంహణార్థాయ" —వేదార్థాలను లోకంలో ప్రచారం చేయడం కోసం— అని భావం. అందుచేత శ్రీరామాయణం వేదపాదుర్భావ విశేషం —అని, వేదార్థాలు ఇందులో నిండి ఉన్నాయని తెలుపబడినట్లయినది.

భగవద్రామానుజులు దీనిలో ఉండే అర్థవిశేషాలను వినడంకోసం తిరుపతి క్షేత్రానికి వెళ్లి, అక్కడ ఉండే తమ మేనమామ అయిన తిరుమలనంబి సన్నిధిలో ఒక సంవత్సర కాలం పాటు వేంచేసి ఉండి, అన్ని అర్థాలను విన్నారు అనే ఈ ఒక్క విషయమే చాలు కదా, దీని గొప్పతనాన్ని తెలియడానికి. శ్రీరామాయణాన్ని సేవించేవారు అందరూ "పితామహస్యాపి పితామహాయ ప్రాచేతసాదేశ ఫలప్రదాయ, శీభాష్యకారోత్తమదేశికాయ, శ్రీశైలపూర్ణాయ నమో నమః స్తాత్" అనేశ్లోకాన్ని తప్పకుండా అనుసంధిస్తున్నందున, పైన ప్రస్తావించిన ఐతిహ్యం నమ్మదగినది అవుతున్నది.

ఇరామానుశనూత్తందాది ప్రబంధంలోని "పడికొండ కీర్తి ఇరామాయణమెన్నుమ్ పత్తి వెళ్ళమ్ కుడికొండ కోయిల్ ఇరామానుశన్" అనే పాశురం ఇక్కడ గుర్తించదగినది. ""పడికొండ కీర్తి" అని అంటే— శ్రీ రామాయణప్రఖ్యాతి భూమిలో అంతటా వ్యాపించింది—అని చెప్పబడింది. రామాయణాన్ని ఒక గ్రంథంగా

చెప్పకుండా, "పత్తి వెళ్ళమ్" అని భక్తిప్రవాహంగా చెప్పినందున, శ్రీరామాయణంవల్ల భక్తి వృద్ధి చెందుతుంది— అని, శ్రీరామాయణాన్ని భక్తితో అధికరించాలని చెప్పబడింది. ఆళ్వార్ల దివ్యప్రబంధాలను వ్యాఖ్యానం చేసిన మన పూర్వాచార్యులు, ఆ వ్యాఖ్యానాలలో మధ్య మధ్యలో ఎన్నో శ్రీరామాయణ శ్లోకాలను ఉదాహరించి చూపి, చాలా రసఘనంగా వ్యాఖ్యానించినందువల్ల కదా, ఆ దివ్యప్రబంధవ్యాఖ్యానాలకు కూడా అతిశయం కలిగింది. ముఖ్యంగా, వాల్మీకి మహాముని మహాభాగ్యశాలి అని అనాలి. ద్రావిడబాటలో తిరువాయ్ మొళి ప్రబంధం, సంస్కృత భాషలో శ్రీరామాయణమే లోకంలో మిక్కిలి ప్రఖ్యాతిని పొంది వెలుగుతున్నాయి.

★★★★